# కావ్య పంచమి

( అయిదు హిందీ మహాకావ్యాల పరిచయం )







గాదంశెట్టి శ్రీరాములు M. A.

ప్రథమముద్రణము: వేయిప్రతులు

జూన్ 1977.

సర్వస్వామ్య సంకలితము.



ప్రతులకు:-

ప్రకాశకురాలు — జి. గోవిందలక్ష్మి
తూర్పు బ్రాహ్మణవీధి
W 4/205, గూడూరు.
నెల్లూరుజిల్లా.



మూల్యము:
రు 5-



ముద్రణ:
కమలాంబికా, నెల్లూరు.
ఫోన్:

# మనవి

ఈరచన మౌలికమైనదికాదు. అలాగని అనువాద రచన అసలేకాదు. సంక్షిప్తసారాంశం కానేకాదు. విమర్శనాపరమైన వ్యాసంకూడాకాజాలదు. అన్నిటినీ అవగాహనచేసుకొన్న 'అయిదు మహాకావ్యాలపరిచయం' మాత్రమేనని మనవి.

వర్తమానసమాజంలో పద్యకావ్యాలుచదివేవారు బహు తక్కువ. ఆసక్తికలవారుకూడా తగినంత కాలాన్ని వినియోగపరచ జాలక కొంతమందీ, అర్థంచేసుకోవడానికి అధికశ్రమ పడవలసి వస్తుందని కొంతమందీ, ఈ పద్యకావ్యాలను తట్టేస్తూవుంటారు.

సామాన్య పాఠకుల్లో సాహిత్యాభిలాష పెంపొందింపచేయా లంటే, మహాకావ్యాలకు పరిచయవ్యాసాలు తయారుకావాలనీ, వాటిద్వారా మూల కావ్యాలవైపు పాఠకుల మనస్సును మళ్ళింప చేయాలనీ కొంతమంది సాహిత్యవేత్తలు అంటూవుంటారు.

హిందీలో ఏఏకావ్యాలు ఏఏ ప్రతే కతలు కలిగివున్నదీ తెలుగుపాఠకలోకానికి తెలియపరచాలనే జిజ్ఞాసతోనే ఈవిధానం తల పెట్టబడింది. ఇందులోని 'కామాయని' 'ఊర్వశి' కావ్య పరిచ యాలు భారతి, ఆంధ్రప్రదేశ్ పత్రికలందు ప్రచురించబడ్డాయి. ఆయా పత్రికాధిపతులకు నాహృదయపూర్వక ధన్య వాదాలు. గ్రంథ

విస్తరణ భీతితో పై రెండు కావ్యాలపరిచయాలు అతిసంక్షిప్తంగా వుంచడం జరిగింది. సహృదయులైన పాఠకులు ఇందుపై తమ తమ అభిప్రాయాలు, సలహాలు తెలుపవలసినదిగాను, తమచేతికి అందిన పుస్తకాన్ని వీలైనంత ఎక్కువమందిచేత చదివింపచేయమనిన్నీ మరీమరీకోరుచున్నాను. భగవదనుగ్రహంవలన ద్వితీయ ముద్రణవేయించవలసివస్తే సహృదయపాఠకుల సలహాలమేరకు సవరించి, ఇప్పుడు క్లుప్తంగావున్న రెండు కావ్యపరిచయాలు మిగతవాటికి సమానంగా సుకరావలెననే ఉద్దేశంవున్నది.

ఈ పుస్తకరచనలో మూలగ్రంథాలకు తోడుగా 'హిందీ ప్రచార్ సమాచార్' పాతపత్రికలు బాగా వుపకరించాయి. ప్రసిద్ధ కవి శ్రీయుత ముదివర్తి కొండమాచార్యులుగారు వ్రాతప్రతిని చదివి వినిపించగా ఎంతో ఓపికతోవిన్నారు. వారు నాయెడల చూపిన ఆదరాభిమానాలకు, వారి అమూల్యసలహా, సహకారాలకు నా ధన్యవాదాలు.

నాకు పితృతుల్యులైన శ్రీ పోలేపల్లి సీతారామయ్యగారి ప్రేరణతో ఈపుస్తకం రూపొందాల్సిగా, సరస సహృదయమిత్రులు శ్రీ బొమ్మిశెట్టి యల్లమందయ్యగారి ప్రోత్సాహంతో ఈ పుస్తకం ముద్రణకు ముందడుగు వేసింది,

ముద్రణకాలంలో నాకు చేదోడుగా సహాయపడిన కవివర్యులు శ్రీయుత జక్కా వేంకటేశ్వరుడుగారికి నా ధన్యవాదాలు,



నాయందు ఆదరాభిమానాలతో అడిగినవెంటనే ఈపుస్తకంపైన తమతమ అభిప్రాయాలు వ్రాసిపంపిన విద్వాంసులకు నాహృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు.

ముచ్చటైన ముఖచిత్రాన్ని తయారుచేసిఇచ్చిన శ్రీ మను బోలు వరదారెడ్డిగారికి, ఈ పుస్తకాన్ని స్వల్పవ్యవధిలో అందంగా అచ్చువేసిఇచ్చిన శ్రీ కమలాంబికాప్రెస్‌వారికి నా కృతజ్ఞతలు.

ఈ కృతిని నా ప్రియతమ పితరులు పూజనీయులైన శ్రీగాదంశెట్టి నరశింహం, వెంకటలక్ష్మమ్మగార్లకు అంకిత మొసంగి చరితార్థుడనగుచున్నాను.

గూడూరు,

30-6-77

— గాదంశెట్టి శ్రీరాములు

డా॥ ఇలపావులూరి పాండురంగరావు, యం. ఎ; పిహెచ్. డి.
ఆఫీసర్ ఆన్ స్పెషల్‌డ్యూటీ; యూనియన్ పబ్లిక్‌సర్వీస్‌కమీషన్,
న్యూఢిల్లీ.

# అభినందన

గ్రాదంశెట్టి శ్రీరాములుగారు నాకు చిరపరిచితులు. హిందీ తెలుగుభాషల్లో చక్కని అభిరుచి, చిక్కని వైదుష్యంకలిగిన గుణజ్ఞులు, రసజ్ఞులు, హృదయజ్ఞులు. మామూలు హృదయాలనేకాక మహాకవుల మనస్సులనుకూడా అవగాహనం చేసుకోగలిగిన మనస్వి. వీరి "కావ్యపంచమి" చదివినవారికి ఈవిషయం బాగా బోధపడుతుంది.

'కావ్యపంచమి'లో అయిదు హిందీకావ్యాలపరిచయం సరళశైలిలో సంగ్రహంగా, సుగ్రాహ్యంగా సంపుటీకరింపబడివుంది. ఇందులో మొదటి రెండు కావ్యాలు — సాకేత్, యశోధర — శ్రీ మైథిలీ శరణ్‌గుప్తవి. మధ్యవిరెండు భారతీయజ్ఞానపీఠ బహుమతి పొందిన శ్రీ రామధారీ సింహ్ దినకర్ రచించినవి. చివరిది 'కామాయని'. వరుసలో చివరిదయినప్పటికీ, బరువులో గురుతరమయినది యీ కావ్యం. ఈకావ్య సౌందర్యాన్ని నిరూపించటంలో గ్రా శ్రీరాములుగారికి నా పలుకులపైగలిగిన మమకారం నాకు చాల

ఆమోదకరంగా, ఆహ్లాదకరంగాఉంది. ఈ వ్యాసంలో వారిదృష్టిని మూలంకంటె నా అనువాదమే ఎక్కువ ఆకర్షించినట్టు కనిపిస్తు న్నది. ఈ కామాయనికి దినకర్ సృష్టించిన ఊర్వశికి చాలా పోలికలున్నాయి. ఈ తారతమ్యాన్ని శ్రీరాములుగారు చక్కగా నిరూపించారు.

ఒక్క కురుక్షేత్రకావ్యంతప్ప మిగిలినవన్నీ ఏదో ఒక రూపంలో స్త్రీ విత్వాన్ని రసదృష్టితో సమీక్షించేవే యీకావ్యపంచమిలో ప్రవే శించాయి. ఊర్వశి ఈ స్త్రీవనంలో ప్రధానమయిన కుసుమరాజం. ఈ కుసుమ సౌకుమార్యాన్ని రచయిత మెలకువగా వివరించారు. భారతంలోని యుధిష్ఠిర శాంతనవుల సంభాషణను ఆధారంగా చేసు కొని వ్రాసిన 'కురుక్షేత్ర' కావ్యం కవి కాలపు సమస్యలకు చెం దిన నవభారతం. దీన్ని 'దినకరభారతం' అన్నా అనవచ్చు. ఇందు లోని రాజనీతిని రచయిత విపులంగా వివరించారు.

రచయితకు గుప్తగారి కావ్యద్వయంమీద ఎక్కువ మమ కారం ఉన్నట్టు కనిపిస్తున్నది. ఊర్మిళా యశోధరలను ప్రధానంగా చిత్రించిన యీరెండుకావ్యాల్లో చిర నవీనతవుంది. ఆదికవిసృష్టిలో అణగి మణగి ఉన్న ఊర్మిళ యీకవి దృష్టిలో ఉవ్విళ్ళూరుతున్న ఉత్సాహంతో కనిపిస్తుంది. అలాగే యశోధర పైటకొంగులో యుగయుగాల పరమ రమణీయ కరుణగాథలు పలుకుతాయి. ఈ రెండు కావ్యాలకు ఈసమీక్షతో చక్కని ప్రాతినిధ్యం లభించింది.

'కావ్యపంచమి'లోని ఐదు కావ్యాలూ హి ం దీ యోషిత ముత్తయిదువతనాన్ని ముచ్చటగా నిరూపిస్తాయి. ఈ కావ్యకర్తలు ముగ్గురూ అపార్థివరూపంలో ఈనాటి వించివున్నారు. ఆధునిక హిందీ సారస్వత సారస్యాన్ని రుచి చూడవలెనన్న ఈ సమీక్ష సూక్ష్మంలో మోక్షం సాధించిపెట్టగలదు. చిరం వి శ్రీరాములు రచనారంగంలో చిరకాలం కృషిచేయవలసిన త రు ణ మే ధా వి. పుస్తకరూపంలో ఇది తొలి ప్రయత్నమైనప్పటి ఇందులోని ప్రతి పదంలో అతని ప్రతిభా ప్రౌఢిమ పరిమళిస్తూనేఉంది. ఇలాంటి రచనలు ఇంతకు మించినవి మరెన్నో అతనిచేత రచింపచేయవలసి నదిగా సర్వవాగీశ్వరేశ్వరిని ప్రార్థిస్తూ రచయితను హృదయపూర్వ కంగా అ నందిస్తున్నాను.

కొత్తఢిల్లీ
2—6—77

— ఇలపావులూరి పాండురంగరావు

విద్వాన్
శ్రీ ముదివర్తి కొండమాచార్యులు,
గూడూరు.

'కావ్యపంచమి' అధునాతనములైన ఐదు హిందీమహా కావ్యాల పరిచయగ్రంథం. మైథిలీశరణగుప్త రచించిన సాకేత్, యశోధర — రామ్‌ధారీసింహ్ దినకర్ కృతములు ఊర్వశి, కురుక్షేత్రం — జయశంకర్ ప్రసాద్ ప్రణీతం కామాయని ఈ పుస్తకంలో సంగ్రహంగా సమీక్షించబడ్డాయి. హిందీభాషానభిజ్ఞులైన ఆంధ్రరసికులకు ఈరచన ఆయా మహాకావ్యములను పఠింపవలెనన్న ఆసక్తి తప్పక కల్గించిననూ ఆ గ్రంథాలను పరిపూర్ణంగా అనుభవించనిదే తృష్ణ శమింపదు.

కావ్యపంచమికర్త సాహిత్యరత్న శ్రీ గాదంశెట్టి శ్రీరాములు, యం. ఏ; గారు. గూడూరు ప్రభుత్వకళాశాలలో హిందీభాషావిభాగమునకు అధ్యక్షులు. వీరు ఉభయభాషలలో కూలంకషమైన పాండిత్యముగలవారు. ఎంతటి పండితులో అంత నమ్రులు; అంత సముదాత్త చరితులు, ఈ మహామనీషి హిందీభాషలో ప్రశస్తతరములైన ప్రబంధములను ఇట్టి సుప్రసన్న మధురశైలిలో తెలిగించి త్రిలింగభాషా సరస్వతికి అపూర్వ భూషావిశేషములను సంఘటింపగలరని ఆశపడుచున్నాను.

గూడూరు,
2—7 — ముదివర్తి కొండమాచార్యులు

ప్ర దుగ్గిశెట్టి వేంకటరమణయ, B A., F. CA.
రమణీయరామాయణ రచయిత
ప్రకాశ్‌నగర్ :: నెల్లూరు.

## నా కు తో చి న మా ట

హిందీలో పేర్గాంచిన అయిదుకావ్యాల్లో జాల్వారు యని వాకల్లో తెలుగువారి నోలలాడింప యు జతనమే శ్రీ గాదంశెట్టి శ్రీరాములుగారి ఈ వొత్తము.

ప్రతికావ్యంలోని వైదుష్యాన్ని వైచిత్ర్యాన్ని నాతివిస్త రంగా రచయిత మూలాన్ని అనుసరించి చర్చించారు.

వాల్మీకిరామాయణంలో విస్మరింపబడిన ఊర్మిళ, ఉదాత్తత 'సాకేతసౌరభంలో' విస్తరింపబడినది. విరిసినయౌవనంలో విభుని వియోగంచేత క్షుభితయైనది ఊర్మిళ. జవ్వనపువొంగు చల్లారిన వేళ, పదునాలుగువత్సరాల వనవాసానంతరం పతిసంయోగాన్ని ఊర్మిళ ఎలా స్వీకరిస్తుందో చక్కగా వర్ణింపబడినది.

ఈ కావ్యంలో సుమిత్రపాత్ర వాల్మీకి చిత్రించినదానికి భిన్నంగాఉన్నది. శ్రీరాముని వనవాసగమనాన్నివిన్న సుమిత్ర సింహంమాదిరి గర్జిస్తూ "మేము ఇతరులసొత్తు ఆశించము. మా సొత్తును వదలుకోలేము.... ...... ....లక్ష్మణా.... ...... ....ఎలా ఊరు కున్నావు" అని అంటుంది సాకేత్‌లో.

వా ్మీకి రామాయణంలో సుమిత్ర 'ధర్మస్థిత :' 'వాక్యోప చారకుశల'; అనవద్య. ఆమె శ్రీరామచంద్రుని మాహాత్మ్యము చక్కగా నెఱిగినది. దుఃఖంలో మునిగిన అంతఃపురంలో చలింపక నిలచినది సుమిత్ర. కన్నీరుకార్చకుండా ఆమె రాముని వెంట లక్ష్మణుని అడవికి పంపుతుంది. లక్ష్మణుని అడవికి పంపేటపుడు ఆమె అతనితో ఇలా అంటుంది.

శ్లో॥ రామందశరథం విద్ధి మాంవిద్ధిజనకాత్మజం
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖం.
( 2- 0-9 )

శ్రీరాముని నీతండ్రిగాను, జానకి నీతల్లిగాను, అడవిని అయోధ్యగాను చూచుకో. కౌసల్యానోదారుస్తూ శ్రీరామచంద్రుని గుఱించి సుమిత్రచెప్పిన మాటలివి.

శ్లో॥ కీర్తిభూతాం పతాకాం యో
లో భ్రమయతి ప్రభుః
ధర్మసత్యవ్రత ధనః
కిం న ప్రాప్తస్తవాత్మజః (2-4 -7)

ధర్మసత్యవ్రతుడగు నీ కుమారున మగును? తన కీర్తి పతాకాన్ని లోకములో త్రిప్పును.

శ్లో॥ దైవతం దైవతానాంచ
భూతానాం భూతసత్తమః
తస్యకేహ్యాగుణాదేవి
రాష్ట్రే వా ప్యవాపురే. (2- - )

దేవతలకు దేవుడు, భూతములకు భూతము. అట్టివానికెవరపకారముసేయగలరు? కనుక నీవు దుఃఖింపతగదని చెప్పెను.

సుమిత్ర ఇటువంటి గుణవతి. ఆమెను 'సాకేత్‌లో మైథిలీశరణగుప్త' రాజ్యకాంక్షోన్మాదినిగా ఆక్రోశింపజేసినాడు.

'యశోధర'లో స్త్రీయొక్క ఉన్నతస్థానమభివర్ణింపబడినది. పసిబిడ్డను పత్నిని శోకసాగరానముంచి గౌతముడు మానవయాతనల పరిష్కారాన్వేషణకు అర్ధరాత్రివేళ అడవికేగెను. తన వియోగంచే ప్రియఅనుభవించుయాతన నాతడెఱుగడా? సతి నిరీక్షణకు ఫలితంగా బుద్ధుడు భార్యగడపద్రొక్కి ఆమెకన్నీరుతుడుచుట, అభిమానవతియైన అర్ధాంగిని తన కఠినమైనచేతను మన్నించమని అడుగుటయే.

ఊర్ధ్వలోకపు టుజ్జ్వలాంగి ఊర్వశి, మానవుని మోహించి అతనిని రసధునిలోముంచి పిచ్చివానిని చేస్తుంది. భోగలాలస మానవునికి తృప్తినీయజాలదు. సర్వసంగపరిత్యాగమే మానవుని పరమావధియని ఊర్వశి కావ్యం ఋజువుచేస్తుంది.

కురుక్షేత్రంలో కొందరు బలవంతులు, పరిస్థితుల ప్రభావం వలన తమ మనో వృత్తులకు విరుద్ధంగా చరిస్తారు. వారిలో ముఖ్యుడు భీష్ముడు, ధర్మమిది అని తెలిసియు అధర్మపరులపక్షాన యుద్ధంచేస్తాడు. భీష్ముని మానసిక సంఘర్షణ చక్కగా దిద్ది తీర్చ బడినది.

కామాయనిలోని కావ్యసౌందర్యాన్ని, మూలంలోని అందాలు చెదరకుండా శ్రీ ఇలపావులూరు పాండురంగరావు ఎలా అనువదించారో, రచయిత, సోదాహరణంగా ఉటంకించినారు.

హిందీలో ఈ కావ్యాన్ని చదువలేని తెలుగువారిలో ఈ రచన మూలములమీద ఉత్కంఠను రేకెత్తిస్తుంది. రచయిత హిందీ కావ్యాల్ని యథాతథంగా అనువదించి తెలుగువారిఅభిలాషను అచిర కాలంలో తీరుస్తారని ఆశిస్తాను.

ఈ రచనలోని శైలి మాటాడేపలుకుబడితో కూర్చవలెననే ఉత్సాహంతో సాగింది. కాని పలికేమాటను అలాగే రచించటం మీదు మిక్కిలి ఆశైలిలో కావ్యాన్ని సమీక్షించటం కష్టమైనకర్జము. ఇట్టి రచనలో రచయితకు అడుగడుగునా క్లిష్టసమస్య లెదురవుతాయి. ఒక ప్రాంతంమాట ఇంకొక ప్రాంతంవారికి అర్థంగాకుండా ఉండేపరిస్థితి యేర్పడుతుంది. కామాయనిని సమీక్షించిన శైలిలో అన్ని వ్యాసాలు వ్రాసిఉంటే బాగుండేదేమో!

నెల్లూరు,
2 - -77

— దుగ్గిశెట్టి వేంకటరమణయ్య

## ఈ గ్రంథ ప్రచురణకు

## ఆర్థికసహాయమొనరించిన సాహిత్యాభిమానులైన దాతలు.

| | | | |
|---|---|---|---|
| శ్రీ బొమ్మిశెట్టి యల్లమందయ్యగారు, | నెల్లూరు | రు | 200- 0 |
| శ్రీ యద్దపల్లి గోవిందుశెట్టిగారు | నెల్లూరు | రు | - 0 |
| శ్రీ మాదాల బాలతిమ్మయ్యగారు | నెల్లూరు | రు | 00-00 |
| డా॥ బాదం మాలకొండయ్యగారు | నెల్లూరు | రు | 0-0 |
| ( చేబ్రోలు కృష్ణమూర్తి, గ్రేడ్ హిందీ పండిట్, | వాకాడు | రు | 00- 0 |
| శ్రీ అయితా అప్పయ్యగారు | నెల్లూరు | రు | 00-0 |
| శ్రీ P. L. కాంతారావు, ప్రిన్సిపాల్, హిందీ విద్యాలయం, | నెల్లూరు | రు | 00-00 |
| (మతి కామిశెట్టి కళావతి, హిందీపండిట్ | నెల్లూరు | రు | 0 - 0 |
| శ్రీ పద్మనాభుని తాయారమ్మగారు, | నెల్లూరు | రు | 00-0 |
| శ్రీమతి ఇ. పద్మాసని, గ్రేడ్ హిందీపండిట్, | నెల్లూరు | | |
| ( దేవిశెట్టి సుబ్రహ్మణ్యంగారు | నెల్లూరు | రు | -0 |
| శ్రీ పెద్దిశెట్టి సత్యనారాయణగారు | గూడూరు | | |
| శ్రీ పోలేపల్లి సీతారామయ్యగారు, | చందలూరు | రు | 0-0 |
| శ్రీ మునగనూరి సుబ్బారావుగారు | కనిగిరి | రు | 0- |
| శ్రీ కొప్పురపు కోటయ్యగారు | కనిగిరి | | |

| | | | |
|---|---|---|---|
| శ్రీ ముచ్చర్ల సుబ్బయ్యగారు | కనిగిరి | రు | -0 |
| శ్రీ పి. జ్వాల నరసింహులుగారు | మద్రాసు | రు | - 0 |
| శ్రీ కె. గోవిందాచార్యులు, హిందీపండిట్, | మినగల్లు | | |
| శ్రీ కె. మల్లికార్జునరావు, హిందీపం ట్, | ఇసకపల్లి | రు | - |
| శ్రీ వొమ్మిన పెదమస్తానయ్య, హిందీపండిట్, | పాకల | రు | 00- |
| శ్రీ విజయా శిల్కు స్టోర్స్, | చీరాల | రు | 6-00 |
| శ్రీ విజయా కార్పోరేషన్, | చీరాల | రు | 6-00 |
| శ్రీ గాదంశెట్టి సత్యనారాయణగారు, | చీరాల | రు | 6- 0 |
| శ్రీ ఆలపాటి వెంకటసుబ్బారాయుడు & సన్స్, | చీరాల | రు | 6-0 |
| శ్రీ పూడి సత్యనారాయణగారు, బందరు మిఠాయి, | చీరాల | రు | - |
| శ్రీ గాదంశెట్టి పెదనరశింహంగారు, | పొదిలి | రు | 0 -00 |
| శ్రీ మంచికంటి లక్ష్మినారాయణ & సన్స్ | కనిగిరి | రు | 0 - |
| శ్రీ దేవకి బాలకృష్ణమూర్తిగారు, | కనిగిరి | రు | 0 - |
| శ్రీ యేల్చూరి సంగయ్యగారు, | విజయనగరం | రు | 0-00 |

వీరందరినీ పరమాత్ముడు దీర్ఘాయురారోగ్య భోగభాగ్య పుత్రపౌత్రాది సంపదలనొసంగి సదా సర్వదా రక్షింపవలయునని ప్రార్థించుచున్నాను.

— గ్రంథకర్త.

# వి ష య సూ చి క

సాకేత సౌరభము

౧ మైథి శరణ్ గుప్త 49

యశోధర 5

ఊర్వశి 76

కురుక్షేత్రం

౨ జయశంకర్ ప్రసాద్

కామాయని కావ్యసౌందర్యం 6

# సాకేత సౌరభము

రామధామమైన అయోధ్యయే సాకేతపురము. "సాకేత్" ఆధునిక హిందీసాహిత్యంలో శ్రేష్ఠతమ మహాకావ్యం. దీని రచయిత సుప్రసిద్ధ మహాకవి శ్రీ మైథిలీ శరణ్‌గుప్తగారు. రఘువంశపు స్త్రీపాత్రలను భావగర్భితంగా చిత్రించగలిగిన యశస్సు ఇంతకుపూర్వపు రామకథాకారులకంటే మిన్నగా ఈ మైథిలీ శరణ్ గుప్తగారికే ల ంచింది. ఇందులో కవి ముఖ్యంగా ప్రాచీన అధునాతన విశ్వాసాలలో సామంజస్యంచూపాడు. ఈకవి హృదయాంతరాళంలో జాతీయభావన మిక్కుటంగా కనపడుతుంది. ఈయన రామకథలోని వివిధ అంగాలను నూతన దృక్కోణంతో చూచాడు. ఇది ఒక కరుణ రసప్రధానమైన మహాకావ్యం.

సీతారామలక్ష్మణులు అయోధ్యనువదలి వనవాసంవెళ్లారు. కాని ఊర్మిళ అయోధ్యలోనే వుండిపోయింది. ఆమెయే ఈసాకేత్ కావ్యానికి ప్రధాన నాయిక. వాస్తవానికి 'సాకేత్' సంపూర్ణ రామకావ్యమైనా, కవి ఊర్మిళతోపాటు అయోధ్యలోనే వుండి పరోక్షంగా కథ చెప్పాడు. అందువలన కావ్యపు ప్రధాన కార్యక్షేత్రం సా త పురమనబడే అయోధ్యానగరమే.

విశ్వకవి రవీంద్రనాథ్‌టాగూరు రచించిన 'ప్రాచీన సాహిత్యం అనే గ్రంథంలో "కావ్యోపేక్షితపాత్రలు" అనబడే

వ్యాసమే ఈకవికి ఈకావ్యం వ్రాయడానికి ప్రేరణ కలిగించిం దంటారు.

ఠాగూరు ఒకమారు ప్రాచీనసాహిత్యాన్ని అధ్యయనంచేస్తూ చేస్తూ పురాతన కావ్యాల్లోని కొంతమంది స్త్రీపాత్రల చిత్రణలో నిష్ఠురమైన ఉపేక్షభావాన్నిచూచి నిస్పృహచెందాడు. ఆదికవి వా కి నోటివెంట క్రౌంచపక్షివధచూడగానే "మానిషాదప్రతిష్ఠాం .................." శ్లోకము వెలువడినట్లే విశ్వకవి కలంనుం "కావ్యోపేక్షితపాత్రలు" అనేవ్యాసం వెలువడింది. ఆయన తన వ్యాసంలో "సంస్కృత సాహిత్యంలోని కావ యజ్ఞశాలయొక్క ప్రాంతభూమిలో ఎంతోమంది స్త్రీలు అనాదృతలై నిలబడ్డారు. వాళ్లలో ప్రధానస్థానం ఊర్మిళది..............అయ్యో! అవ్యక్త వేదనాదేవీ, ఊర్మిళా! ఒకమారు నీవు ప్రాతఃకాలపు నక్షత్రంవలె మహాకావ్యపు మేరుపర్వతంపై ఉదయించావు. తదుపరి అరుణ లోకంలో నీదర్శనంకాలేదు. నీవు ఎక్కడ ఉదయించావు? ఎక్కడ అస్తమించావు? ఈ ప్రశ్న అడగడానికిగూడా అందరూ మర్చి పోయారు" అన్నాడు.

రామాయణంలోని ఊర్మిళ, శాకుంతలంలోని అనసూయ, ప్రియంవదలు, కాదంబరిలోని పత్రలేఖ, బుద్ధచరితంలోని యశో ధర మొదలైన పాత్రలు పూర్వకాలపు కవులద్వారా ఉపే క్షితబడ్డా రనే సత్యాన్ని మొదటగా వెలుగులోకితెచ్చినవారు విశ్వకవి ఠాకూర్ గారు.

ఊరి ళ, కైక, యశోధర మొదలగు పాత్రలను చిత్రించ డంలో ప్రాచీనకవులు చెప్పుకోదగిన శ్రద్ధవహించలేదు. కాని మైథి శరణ్‌గుప్తగారు తనఅ వ్యక్తి కౌశలముతో వారివారి స్థానా లను నిర్ధారణచేశారు.

'సాకేత్'లో ఊర్మిళనేకాకుండా, కైక, మాండవీ, శ్రుత ర్తి, భరతుడు, శత్రుఘ్నుడు మొదలగు పాత్రలన్నింటికీ నా యం చేకూర్చిన ఘనత ఈకవికి ల ంచింది.

తులసీరామాయణంలో కళంకితయైన కైక 'సా త్' లో పాఠకుల సానుభూతికి పాత్రురాలైంది. సాకేత్‌లోని చిత్రకూట సమావేశంలో కైక పశ్చాత్తాపమువిని సాకేత సమాజమంతా కన్నీరు కార్చింది. ఈవిధంగా కవి ప్రాచీనభావాన్ని ఆదరిస్తూనే ఔన్నత్యమువైపు నడిపించి ఆధునిక భావానికి స్వాగతం పలికాడు. భాష, భావము, స్వతంత్ర ఉద్భావనలు ప్రాచీనకథలో నూతన ప్రాణాన్ని నింపివేశాయి.

ఈ సాకేత్ జా యభాషఅయిన హిందీలో వ్రాయబడిన పన్నెండు సర్గల మహాకావ్యం. ఇందులో రామకథ పూర్ణంగా వర్ణించబడింది. ప్రాచీన హిందీలో తులసీదాస విరచితమైన 'రామ చరిత మానసము', కేశవదాసు రచించిన 'రామచంద్రికా' రెండూ ప్రసిద్ధములే. అవి వున్ననూ ఆధునిక హిందీలో సాకేత్ కావ్య నిరా ణము కవియొక్క శక్తినీ, సామర్థ్యాన్నీ, భావనాబలాన్నీ రుజువుచేస్తున్నాయి.

పరంపరగా వస్తున్న రామకథలో ఈకవిచేసిన మార్పులు చేర్పులు, ప్రత్యేకతలు తెలియచేయడమే ఈ రచన ఉద్దేశ్యము

ఆదికవి వాల్మీకి తనరామాయణంలో విష్ణువుకు రాముడికి నేరుగా ఏమీ సంబంధం చెప్పివుండలేదు. రాముణ్ణి అవతార పురుషుడిగాకూడా వర్ణించలేదు. ఆయన వలం మానవుడు, మహాత్ముడు, మహనీయుడు, ధీరోదాత్తనాయకుడు మాత్రమే. వాయుపురాణంలో రాముణ్ణి విష్ణువు అవతారంగా భావించారు. అందులో రాముడు ఈశ్వరత్వపదవిని అధిష్ఠిస్తాడు. ఇంకొంచెం ముందుకు వెళ్ళితే అధ్యాత్మరామాయణంలో రాముడు దేవతల వరుసలో ి పోతాడు.

హిందీలోని రామకావ్యపరంపరలో సర్వప్రధానమైన కవి తులసీదాసు. ఆయనవ్రాసిన రామచరితమానసము రాముని అమర కథను శోభాయమానంచేసింది. తులసీదాసు రాముణ్ణి అవతారవాదిగా అంగీకరించడమేగాకుండా, అడుగడుగునా ఆయన విష్ణుమూర్తి అవతారమేననీ, సామాన్యమానవుడుకాడనీ జ్ఞాపకం చేస్తూవుంటాడు.

ఆధునిక హిందీలో వ్రాయబడిన సాకేత్ కావ్యంలో శ్రీ మైథిశరణ్‌గుప్తగారు రామకథను ఒక కొత్తపంథాలో నడిపించారు. ఆయన మానవమాత్రుడైన రాముడిలో ఈశ్వరత్వాన్ని దర్శించాడు. రాముణ్ణి పూజించడమంటే సమస్తవిశ్వాన్నీ

పూజించడమన్నాడు. ఇందులో విశ్వబంధుత్వ భావనకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు. ఆయన రాముడు స్వర్గలోక సందేశాన్ని సుకొనిరావడం గాకుండా ఈలోకాన్నే స్వర్గతుల్యంచేయడానికి వచ్చాడు.

ఇందులో లక్ష్మణుడు, శత్రుఘ్నుడు మొదలగు పాత్రలు కొన్ని ప్రాచీనశిష్ట మర్యాదలను అతిక్రమించడం జరిగింది. కాని సీతారాముల పాత్రలకు సంబంధించినంతవరకు ఆదర్శపూర్ణంగా వర్తమాన సామాజిక నీతి సిద్ధాంతాలకు అనుకూలంగా నిరూపించబడింది. ఈ సాకేత కావ్యంలో కైక చరిత్రను అన్నిటికంటె గొప్పగా చి కరించడం జరిగింది. ఆమెలోవున్న మానవ సహజమైన దుర్బలత్వము, పశ్చాత్తాపము మిగతా పాత్రలన్నింటికంటే గూడా సఫ కృతంగా చిత్రించబడింది.

కావ్యం ప్రారంభంచేముందు కవి తన ఇష్టదైవాన్ని ఇలా ప్రశ్నించాడు.

"ఓరామా, నాఆరాధ్యదైవమా, నీవు ఈశ్వరుడివికావా? నీవు పరబ్రహ్మ, పురుషోత్తముడైన విష్ణువుయొక్క అవతారమై; సర్వజ్ఞుడు, సర్వవ్యాపియైనవాడవుగాకుండా ఈభూతలంమీద మానవుడవేనా? జగత్స్రష్టయైన ఓ రామా! ఒకవేళ నీవు ఈశ్వరుడివిగాకుండా వలం మానవుడివే అయినచో నేను మరోశక్తివంతుని నమ్మజాలను. మరొకరిని నీస్థానంలో ఈశ్వరునిగా స్వీకరించి

నేను నాస్తికుడిని కావడమే మంచిదనుకుంటాను. ఒకవేళ ఈ ప్రపంచము మరొకరిని ఈశ్వరునిగా స్వీకరించేయెడల అది నా యొక్క ఈవివశతను క్షమించుగాక.

ఓ రామా! నీవు నా హృదయంలో నిలవజాలకపోయినచో, నా మనస్సు ఎల్లప్పుడు నీలోనే రమించేటట్లు వరమొసంగుము." అంటూ వేడుకొన్నాడు.

తదుపరి వ్రాసిన మంగళాచరణలో కవి విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి కావ్యంమొదలెట్టాడు.

# ప్రథమ సర్గ

మొదట కవి సరస్వ దేవిని ఆహ్వానించాడు. తన మానస హంసనెక్కి అయోధ్యకురమ్మని వేడుకొన్నాడు. తదుపరి పాపులను నాశనమొనర్చి భూతల భారాన్ని తగ్గించడానికిగాను భక్తవత్సలుడైన నిరాకార ఈశ్వరుడు అయోధ్యానగరంలో మానవునిగా అవతరించాడని అన్నాడు.

సీతారాములు, ఊర్మిళాలక్ష్మణులు, మాండవీభరతులు, శ్రుత కీర్తిశత్రుఘ్నులు - వీళ్లు పరబ్రహ్మయొక్క నాలుగురూపాలు: అయోధ భూతలంమీద అమరావతికి సమానంగా సరితూగుతూ వుంది. సరయూనది గంగానదికంటే శ్రేష్ఠమైనది. గంగానది మనుష్యులను మరణానంతరం తరింపచేస్తే సరయూనది జీవించి వున్నవారినే తరింపజేస్తుంది.

రాజప్రాసాదమంతా ఆనందోత్సాహంతో నిండివుంది. రాజు, ప్రజలు అందరికోర్కె రామ పట్టాభిషేకమే. తెల్లవారింది. అప్పుడే ఊర్మిళ అరుణవస్త్రముధరించి తనశయా మందిరంలో నిలబడివుంది. అప్పటి ఆమె రూపాన్ని కవి ఇలావర్ణించాడు.

కనక లతికాసీ కమలసీ కోమలా,
ధన్యహై వున్ కల్పశి ప్ప కలా,

"ఈమె బ్రహ్మదేవుని చేతులతో స్వయంగా నిర్మింపబడిన ఏ బంగారు విగ్రహంకాదా? ఈసుందరి బంగారులతవలె కాంతివంతమై అందమైన కమలంవలె కోమలమైనది. బంగారుకాంతి కలిగి కోమలమైన ఈసుందరిని సృష్టించిన ఆ చతురశిల్పి (బ్రహ్మ) కళ నిజంగా ధన్యమైనది."

రాజభవనపు సింహద్వారంవద్ద పిల్లనగ్రోవిరవళి రసవంతంగా వినవస్తూవుంది. ఊర్మిళామందిరంలోని చిలుక ఆ రసమయమైన స్వరాన్ని అనుకరిస్తూవుంది. ఊర్మిళచూపు దానిమీద పడగానే అది మౌనముదాల్చింది. ఆశ్చర్యంగా ఆమెవేపే చూస్తూవుండిపోయింది. ఆమె దాన్ని బుజ్జగిస్తూ తన మౌనానికి కారణమేమని అడిగింది. ఇంతలో అటువైపునుండి లక్ష్మణుడు ప్రవేసించాడు. ఆ కారణమేమిటో నేనుచెబుతాను వినమన్నాడు.

నాక్ కా మో అధర్ కీ కాంతి సే,
జదాడిమకా సమఝకర్ భ్రాంతి సే,
దేఖకర్ సహసా హుఆ శుక మౌనహై,
సోచతాహై, అన్యశుక యహ్ కౌన్ హై?

"అరుణవర్ణంగల నీ అధరపుకాంతి తెల్లని నీముక్కు బుళానికూడా ఎరుపుగా మార్చింది. దాన్ని దానిమ గింజ అనే భ్రాంతితో ఈ మరో చిలుక ఆకస్మికంగా ఎక్కడ్నుండి వచ్చిందా! అని ఆలోచిస్తూ మౌనముదాల్చింది." అన్నాడు లక్ష్మణుడు.

ఊర్మిళయొక్క ముక్కునుచూడగా బహుశా అది మరొక చిలుకా? అ. భ్రమ చిలుకకే కలిగిందన్నట్లుగా ఇక్కడ కవి చమత్కారము.

తదుపరి ఉభయులమధ్య మనోహరమైన సరససల్లాపాలు జరిగాయి. ఆ చిలుక లక్ష్మణుడుచెప్పిన వాక్యాలను వల్లెవేసింది.

ఉభయులు రాముని రాజ్యాభిషేకాన్ని గురించి మాట్లాడుతున్నారు. ఊర్మిళగీసిన ఒక కళాఖండాన్ని లక్ష్మణుడు పరిశీలిస్తుండగా ఊర్మిళ సిగ్గుపడటం, లక్ష్మణుడు ఆవిడను తనచేతుల్లోకి సుకొని హృదయానికి హత్తుకోవడం, ఇంతలో బిరుదావళి ప్రతిధ్వనించడం, దంపతులు చకితులుకావడం - ఈవిధంగా ఊర్మిళా ఆహ్లాదంతో మొదటి సర్గ ముగుస్తుంది.

ప్రాతఃకాల సమయం: అటు అరుణవర్ణ రంజితమైన తూర్పు దిశ. ఇటు అరుణవస్త్రము. తరుణ అరుణవయస్సు. హాస విలాస ఉత్తుంగ తరంగాలలో నవదంపతులు ఓలలాడటం; వర్ణించబడింది.

ఈ కవి తన కావ్యభూమికకు ఇలాంటి ఎంతో మనోహరమైన దృశ్యాన్ని ఎన్నుకొన్నాడు. ఇందులో అ నవ నూతనత్వంతోబాటు అద్భుత దివ్యరసదర్శనం కానవస్తూంది. కవియొక్క రసనిమగ్నత ప్రశంసనీయమైనది.



# ద్వితీయ సర్గ

ఈసర్గలో కవి తల్లి సరస్వతిని, తల్లి జగదంబను స్మరించాడు. వడివడిగా నడవమని తన కలాన్ని మరీమరీ కోరాడు.

కైక, మంథరలమధ్య రామరాజ్యాభిషేకాన్ని గురించి సంభాషణజరిగింది. మంథర దిగాలుగా వుండడంచూసి, రాముని యందు ప్రేమాభిమానంతో నిండిపోయిన కైక ఇలా అడిగింది

"ఏమే, రేపు రాముడు యువరాజు కాబోతుంటే, ఇవాళ నువ్వు ఇలా ఎందుకు దిగులుతోవున్నావు?"

ఇందుకు మంథర "నీకుమాత్రం దిగుల్లేదా?" అని ఎదురు ప్రశ్న వేసింది. కాని కైక తన దిగులుకు వేరేకారణం చెప్పింది.

"నా దిగులు కేవలం భరతుడు తాతగారి ఇంటివద్దనే వుండిపోయాడని మాత్రమే! భరతుడుకూడా ఇప్పుడు ఇక్కడవుండివుంటే రామునిరాజ్యాభిషేకంచూసి ఎంతసంతోషించేవాడు!" అన్నది కైక.

ఆ వరసలోనే మంథర కైకయొక్క అమాయకత్వాన్ని తెలియపరచి ఆమెలో ఈర్ష్యాభావం రెక్కొలిపింది.

"రాజుగారు భరతుణ్ణి ఎందుకు పిలిపించలేదు? ఇందులో ఏదో రహస్యంవుంది. భరతుడిలాంటి కొడుకుపైన సందేహం కలిగి అతణ్ణి ఇంటికి పిలిపించలేదు." అంటూ చెప్పి కైక మనస్సును పాడుచేసింది.

సాంతసౌరభము

ఇం ముందీ? ఈసందేహమనే సర్పము కైకను కాటు వేసింది. ఆమె రకరకాలైన ఆలోచనలు పోయి, ఘోరమైన సంకల్పంచేసింది.

"ఏమైనాకానిమ్ము, నేను ఈఅన్యాయాన్ని సహించజాలను. దీనికి ప్రతీకారంచేస్తాను. ప్రపంచం తల్లక్రిందులైనాసరే, ప్రతీకారం తీర్చుకొంటాను." అంటూ ప్రతిజ్ఞచేసింది.

కైక తెలివితక్కువదికాదు. ఆమె తెలివిపైన ఆమెకు అభిమానంవుంది. ఆమె తన కుమారుని విషయంలో ప్రతీకారం తీర్చనంతవరకు వూరుకోదు. ఆమె మనస్సు వ్యాకులత చెందింది. కౌసల్య రాజమాతయై కైకను తిరస్కారభావంతోచూడటం ఆమెకు బాధాకరం అనిపించింది. వెంటనే తోకత్రొక్కిన త్రాచులాగా బుసలుకొట్టడం మొదలెట్టింది.

ఒకవేపున సీతారాములమధ్య భరతుడు ఇంటలేకపోవడాన్ని గురించి సంభాషణజరిగింది. రాముడు రాజ్యభారాన్ని మోయడానికి సిద్ధంగాలేడు. "రాజ్యమంటే భోగ్యవస్తువుకాదు. అది ఎంతో గురుతరభారంతో కూడివుంది." అంటాడు.

దశరథమహారాజు రాజగురువైన వశిష్ఠులవారితో, భరతుడు దగ్గరలేకపోవడాన్ని గురించి ప్రస్తావించాడు. రాత్రి అయింది. అంతట రాజు కైకమందిరానికివెళ్లాడు. తదుపరి కైక అలక పాన్పు ఎక్కడం, వరాలుకోరడం, మొదలుగాగల అందరికీ తెలిసినకథ ఈ సర్గలో వర్ణించబడింది.

---

# తృతీయ సర్గ

రామలక్ష్మణులు తండ్రికి నమస్కరించడానికి కైకభవనంలో ప్రవేశించారు. స్పృహతప్పి వ్యాకులచిత్తంతోవున్న తండ్రిగారిని కళ్లుతెరవమనీ, తమకు ఆజ్ఞ ఇవ్వమనీ రాముడు ప్రార్థించాడు.

కాని దశరథుడు ఒక్కమారు "హా రామా!" అని తిరిగి మౌనంగా వుండిపోయాడు. తండ్రిగారు అలావుండటానికి కారణమేమని రాముడు కైకను అడిగాడు. అప్పుడామె, "రామా! ఈ కంటకానికి కారణం నేనే! మరేమీ చెప్పజాలను." అంటూ మౌనం దాల్చింది.

మరికొన్నిక్షణాల్లో దశరథుడు తెలివిలోకివచ్చి రాముణ్ణి హృదయానికిహత్తుకొని, తన విశ్వాసమే తనను మోసంచేసిందన్నాడు,

కైకకళ్లు ఎర్రబారాయి.

"రాముణ్ణి భరతుడినుండి ఎందుకు వేరుచేస్తున్నావు? దీని దుష్పరిణామమేమిటో తెలియునా? రాముణ్ణివదలి నేను ఎలా జీవించగలను? చివరకు నీకు మిగలబొయ్యేది పశ్చాత్తాపమే!" అంటూ సూటిగా చెప్పాడు దశరథుడు.

రాముడు తాను వనవాసానికి వెళ్ళడానికి సంకల్పించానని చెప్పాడు. అయినా కైకమనస్సు కరగలేదు. లక్ష్మణుడు మండి పడ్డాడు. అందరినీ చంపేస్తానని హూంకరించాడు. కైక తన కోపాన్ని దిగమింగి వుండిపోయింది. ఉగ్రరూపందాల్చిన లక్ష్మ ణుణ్ణి రాముడు శాంతపరచాడు. మళ్ళ మూర్ఛనుండి తేరుకొన్న దశరథుడు లక్ష్మణునితో -

"ఏదీ మళ్ళీచూపు! నీ హూంకారం నాకెంతో సుఖాన్ని చ్చింది. నన్ను బందీచేసి నువ్వు రాముడికి పట్టాభిషేకంచేసేయి." అంటూ రాముడివేపు తిరిగి -

"రామా! నామాటలువిను. నీవు ధర్మాన్నిపాలించు. నీ తండ్రిని మృత్యువునుండికాపాడు. ఇప్పుడు నువ్వు నాఆదేశాన్ని మన్నించనియెడల అంతకంటే మించినబాధ నాకేముంటుంది?" అన్నాడు.

కాని రాముడు ఆయనకు ధైర్యంచెబుతూ ఆయన పాదధూ ళిని శిరస్సునధరించి లక్ష్మణుణ్ణి ఇంటివద్దనే వుండమని నచ్చజెప్ప సాగాడు.

కాని లక్ష్మణుడు ఎందుకు అంగీకరిస్తాడు? రామలక్ష్మ ణులు ఉభయులు వెళ్లడంచూసిన దశరథుడు ఏడుస్తూ "అయ్యో! కుమారులారా! నన్ను ఇలా మృత్యుముఖంలోకివదలి మీరు ఎం దుకు వెళ్ళిపోతున్నారు?" అని అడిగాడు.

కాని రాముడు నిట్టూర్పుతో వేగంగా అడుగులు ముందుకు వేశాడు. దారిలో సుమంత్రుడు ఎదురయ్యాడు. ఆయనను తన తండ్రివద్దకుపంపి తాను తన తల్లిని కలుసుకోడానికి వెళ్ళాడు.

# చతుర్థ సర్గ

అప్పుడే స్నానమాచరించిన కౌసల్య పట్టువస్త్రము ధరించి దేవతార్చన చేయబోతూవుంది. దగ్గర్లోనే జానకి పూజాసామగ్రి సర్దుతూవుంది. అంతలోనే రాముడు సోదర సహితంగా అక్కడ కి వచ్చి వనవాస సంకల్పాన్ని వివరించాడు.

అమ్మా, ఇవాళ నేను కృతార్థుడినయ్యాను. స్వార్థమే పర మార్థమైపోయింది. నాకు పావనకరమైన వనవాసజీవితం లభిం చింది. నేను ఇప్పుడే అక్కడికి వెళ్ళిపోతున్నాను. ఇక్కడ భరతుడు రాజ్యంచేస్తాడు.''

తల్లి కౌసల్య ఇదంతా పరిహాసమనుకొన్నది. కాని లక్ష్మ ణుడు కంటతడిపెట్టడంతో ఆమె హృదయం తల్లడిల్లిపోయింది. విషయమంతా విని ఇలాచెప్పింది.

''భరతుడే రాజవుతాడు. నేను కైకతో పుత్ర భిక్షపెట్ట మని, రాముణ్ణి వనములకు పంపవద్దనీ వేడుకుంటాను,''

ఇంతలో సుమిత్ర సింహంమాదిరి గర్జిస్తూ అక్కడికివచ్చి- ''మేము ఇతరులసొత్తు ఆశించము. మాసొత్తును వదలుకోలేము. మనం వీరమాతలం. యాచన మృత్యువుతో సమానము. లక్ష్మణా ఈ దారుణాన్ని నేను సహించలేను. నువ్వుచూస్తూ ఎలా వూరు కున్నావు?'' అని అ గింది.

లక్ష్మణుడు కోపాన్ని దిగమింగుతూ రాముడివేపుచూశాడు. రాముడు అందరి నచ్చజెబుతూ -

"తల్లి కుమారునిక్షేమంకోరింది. నృపతి సత్యసిద్ధికోరాడు. పినతల్లి కైకపైన కోపం ప్రదర్శించనా? పుత్రధర్మాన్ని విడనాడనా?" అన్నాడు.

కౌసల్యా సుమిత్రలకోపం తగ్గిపోయింది. సీత తానుకూడా వెంటరావడానికి తయారవడం రాముడు గమనించాడు. ఊర్మిళ సీతభుజాలమీద తలఆనించి కన్నీరుకార్చడం మొదలెట్టింది. అంతలో సుమంతుడు ప్రవేసించి ప్రజలు తిరుగుబాటు తలపెట్టి సున్నట్లు ప్రకటించాడు.

రాముడు ధర్మబోధచేసి వారిని శాంతపరచాడు. దశరథ మహారాజు సుమంతుణ్ణిపిలచి తనకుమారులను రథముపై ఎక్కించుకొని అరణ్యవాసానికి చేర్చమనీ, భరతుడు తిరిగివచ్చాక అతనికి రాజ్యము అప్పగించి ఆనక బ్రతికివుంటే తానుకూడా అడవికివస్తానని చెప్పాడు.

అడవికి వెళ్ళడానికి ప్రయాణమవుతున్న సీతను వెంటతీసు కెళ్ళమని కౌసల్య రాముని కోరింది. వనవాస కష్టాలను వివరించి నచ్చజెప్పడానికి ప్రయత్నించాడురాముడు. కాని సీత వొప్పుకుంటుందా? చేయునదిలేక కౌసల్య ఆశీర్వదించడంతో ముగ్గురూ అరణ వాసానికి బయలుదేరారు.



# పంచమ సర్గ

రథం సిద్ధంగా ఉండడంచూసి రాముడు గురువుకు నమస్కరించాడు. గురువు ఆశీర్వదించాడు. ముగ్గురూ రథంఎక్కారు. రథం బయలుదేరింది. జయజయనాదాలుచేస్తూ ప్రజలుకూడా వెంట రావడానికి ప్రయత్నించారు. నైతరంగా నచ్చజెబుతూ వెళ్ళగా కొంత ప్రజాసమూహం వెనుకకు తగ్గిపోయినా మళ్లీమళ్లీ సముద్రపు అలలమాదిరి వేగంగా వస్తూనేవుంది.

"రామా! నిన్నే మేము రాజుగా ఎన్నుకున్నాము. నువ్వు ఈవిధంగా మమ్ములను విడచి వెళ్ళవద్దు. ప్రజా ప్రాయాన్ని పెడచెవిన బెట్టవద్దు. నువ్వువెళ్ళిపోవాలంటే మమ్ములను త్రొక్కివేసి వెళ్ళు." అంటూ ప్రజలు రథమార్గంలో అడ్డుపడుకున్నారు. అంతట రాముడు ఎంతో అనునయంగా నచ్చజెప్పి వారిని వెనుకకు సాగనంపి రథాన్ని ముందుకునడిపించాడు. సంధ్యాసమయానికి రథం తమసానదీ రానికి చేరింది. ఆరాత్రి లక్ష్మణుడికి నిద్ర పట్టలేదు. రాత్రంతా మేలుకొనే గడిపాడు.

రెండవదినం గోమతీనదినిదాటి గంగానది ఒడ్డుకు చేరుకొన్నారు. గుహుడు కానుకలతోవచ్చి స్వాగతంపలికాడు. తన ప్రీతి వచనాలతో అందరినీ తృప్తిపరచి తనరాజ్యాన్ని తీసుకోమని రాముని ప్రార్థించాడు. రాముడు తమను నదిఆవలిగట్టుకు చేర్పిస్తే చాలుననీ కోరాడు ముగ్గురూ నావపైన ఆశీనులయారు.

సీత స్నేహపురస్సరంగా తన స్వర్ణముద్రికను గుహుడికి ఇవ్వబోయింది కాని భక్తిభావం మూర్తీభవించిన గుహుడు అంగీకరించజాలకపోయాడు. దారిన నడిచేప్పుడు సీతాదేవిశ్రమనుచూచి రాముడు మధ్యమధ్యలో ఆగిపోతున్నాడు. గ్రామీణప్రజలు గుంపులుకూడి సీతను కుశలప్రశ్నలు వేస్తున్నారు: వారు తీర్థరాజమైన ప్రయాగ చేరుకొన్నారు. లక్ష్మణుడు సీతను సరస్వతితో పోల్చాడు. అప్పుడు సీత —

"దేవర్, మేరీసరస్వతీ అబ్ హైకహాఁ?
సంగమ శోభానిరఖ్ నిమగ్నహుయియాయహాఁ."

ఇక్కడ 'సంగమశోభ' ఎంతో వ్యంజనాత్మకమైన శబ్దము. శ్యామగౌరవర్ణం గల రామలక్ష్మణులు 'సంగమ' మయ్యారు. వారి శోభను తిలకించిన సీతాదేవి అంతర్వాహిని అయిన సరస్వతి మాదిరి తన్నుతాను మర్చిపోయింది.

నావనెక్కి ముగ్గురూ యమునానదిని దాటారు. భరద్వాజముని ఆదేశానుసారంగా చిత్రకూటంవేపు పయనించారు. మార్గమధ్యంలో వదినామరదుల వినోదపూర్ణమైన సంభాషణ సాగుచూపోయింది. అరణ్యశోభను చూస్తూ చూస్తూ ముగ్గురూ వాల్మీకి మహాముని ఆశ్రమానికి చేరుకున్నారు. ఇక్కడ వాల్మీకి కవి మాటలు పాఠకులను ఎంతగానో ఆకట్టుకుంటాయి.

"రామ! తుమ్హారా వృత్త ఆప్ హీ కావ్యహై,
కోయీ కవిబన్ జాయ్, సహజసంభావ్యహై.

" ఓరామా! నీచరిత్రే ఒక గొప్పకావ్యం. ఇటువంటి మహా త్తరమైన చరి తను గానంచేసి ఎవ రైనా సులభంగా కవి అయిపో వచ్చును."

ఇచ్చట వా ల్మీకిరాముల కలయికచూపించి, రామకథ ఎవరు వ్రాసినా సులభంగా కవి అయిపోతాడనే సత్యాన్ని ఈకవి సమర్థ వంతగా రుజువుచేశాడు. వా ల్మీకినోట ఈవిధంగా పలికించి రామ కథయొక్క గొప్పతనాన్ని చాటడమే ఇచ్చట కవియొక్క అ ష్టము.

చిత్రకూటము చేరగానే లక్ష్మణుడు మందిర రూపంలో ఒక కుటీరం నిర్మించాడు. అరణ్యవాసులంతా అక్కడచేరి ఉల్లాసంగా నాట్యంచేశారు. పాటలుపాడారు. వారు తమపాటలద్వారా —

" రామా! మేము మాపవిత్ర ఆనందా శ్రువులతో నీకు అభి షేకం చేస్తూవుంటాము. నువ్వు నిజమైన సింహ - ఆసనం మీద కూర్చొని మమ్ములను పాలిస్తూవుండు. అరణ్యాలను మంగళ ప్రదంచేసి మమ్ములను నాగరీకులుగాచెయి " అంటూకోరారు.

ఆ చిత్రకూటంవద్దనున్న మందాకినీనది మందగతితో ప్రవ హిస్తూవుంది. బహుశాః ఆకాశగంగయే స్వర్గంనుండి దిగివచ్చి ఈ మందాకినిలో నమైపోయినదా! అన్నట్లుంది.

# షష్ఠ సర్గ

ఈసర్గ ప్రారంభాన ఈకవి 'రామచరితమానస' మనబడే రామాయణ రచయిత శ్రీ గోస్వామి తులసీదాసును స్తుతించాడు. తదుపరి సాకేతనగరం సుఖ, శాంతి, సౌభాగ్యాలను కోల్పోయిందన్నాడు. ఇక్కడ సుఖ, శాంతి, సౌభాగ్యాలనగా రాముడు, సీత, లక్ష్మణుడు అని సంకేతము. తదుపరి విరహ విహ్వాలమైన ఊర్మిళాదేవి విరహాన్ని వర్ణించాడు.

సాకేతనగరదేవివలె ఎవరిక్కడ పడిపోయారు? ఈమెయే మూర్ఛప పోయివున్న ఊర్మిళాదేవి! ఏ నిష్ఠురహస్తాలు ఈకోమల పదాన్ని జలమునుండి వేరుచేశాయోగదా! సీతాదేవిమాత్రము భర్తను అనుసరించి తన అధికారాన్ని నిలబెట్టుకొంది. కాని ఊర్మిళ ఆ అధికారాన్ని త్యాగంచేసింది. ఈ నవయౌవనంలోని సుఖదాయకమైన క్షణాల్లో ఈమెకు భర్తృవియోగం అనుభవించవలసివచ్చింది. ఈయౌవ్వనదశలోనే సన్యాసిని వేషం ధరించవలసివచ్చిందిగదా!

ఊర్మిళ జీవితంలో కేవలం కర్తవ్యభావన మాత్రమే మిగిలి వుంది. పుణ శీలమైన భూదేవివలె ఈమె తనసుఖాన్ని ఏమీ ఆశించలేదు.

ఆరాధ్యయుగ్మ కే సోనేపర్, ని_స్తబ్ధనిశా హోనేపర్,
తుమ్ యాద్ కరోగే ముఝేకభీ,
తో బస్ ఫిర్ మైంపాచుకీస :.

"ఆరాధ్యయుగ్మం సీతారాములు నిద్రపోగా నిశ్శబ్దరాత్రి నువ్వు నన్ను ఎన్నడైనా జ్ఞాపకం చేసుకుంటే, అంతకంటే నా మరేంకావాలి!" అంటుంది ఊర్మిళ.

అరణ్యావాసపు గడువు అధికభారమైనది. పద్నాలుగే వరకు తాను లక్ష్మణునితో కలవజాలదు. విరహంతో నిండిన ఇ రాత్రింబవళ్లు ఎలాగడుస్తాయి? పగలు వట్టిగా గడచిపోతుం రాత్రిఅయిపోతుంది. మ ల్లె తెల్లవారుతుంది. మ ల్లె శూన్యవై సంధ్యాసమయం వస్తుంది. ఇలా కాలమంతా గొడ్రాలుగ తోస్తుంది.

కుటుంబ పరిస్థితులు మరీ దమనీయంగా వున్నాయి. మ రాజుగారు తుఫానులో వేళ్ళుఊడబెరుకొన్న వృక్షంలాగా శోకబ తుడై జర్జరశరీరుడై పోతున్నాడు. రాణులేమో పుష్పరహిత ల వలె అయిపోయారు. మహారాజుగారి శోక సంతాపము పి వాళ్ళగా చేసేదిలాగుంది. సుమంతుడు తిరిగిరాగానే నలువై నిరాశ వ్యాపించింది. రాజుగారు బురదలో చిక్కుకున్న గజరా లాగా కొట్టుకలాడుతున్నాడు. ఆడఏనుగులలాంటి ఆరా శోకాన్ని ఎవరు వర్ణింపగలరు? రాజుగారి చివరిమాటలు వు త్తలను చేసేవిలాగున్నాయి.

''నాచేతులు విరిగిపోయాయి. నడుంపట్టు తప్పిపోయింది. సుఖం వదలిపోయింది. కంటిపాపలు రాలిపోయాయి. అవి ఇక్కడే ఎక్కడో రాలిపోయాయి.''

అంతే, దశరథదీపం మలిగిపోయింది. ఊర్మిళ కేకపెడుతూ కైకముందర పడిపోయింది.

'' అమ్మా! పూజ్యుడైన ఆతండ్రి ఎక్కడికెళ్ళాడు? ''

కాని పాషాణప్రతిమ కైక కదల్లేదు. మెదల్లేదు. ఆమె పెద్దపెద్ద కనిగుడ్లు అలాగే నిక్కబొడుచుకున్నాయి. అప్పుడు తనకు తానే భయకంపితురాలైంది. ఆకాశం కన్నీరుకార్చ నారంభించింది.



# సప్తమ సర్గ

ఈసర్గ ప్రారంభంలో ఈకవి సంస్కృతంలో ప్రసిద్ధనాటక కారుడైన భాసుణ్ణి ఆయన వ్రాసిన 'స్వప్నవాసవదత్త', 'ప్రతిమా' నాటకాలను జ్ఞాపకంచేశాడు. ఇంతవరకు జరిగిన రామకథలో సంతోషకరమైనభాగం స్వప్నసదృశంగా జరిగిపోయిందనీ, కరుణరస పూర్ణమైన 'ప్రతిమా'నాటకం ప్రస్తావించడంద్వారా ఇప్పుడు కథా గమనంలో కష్టకాలం వచ్చిందనీ సంకేతంచేశాడు.

తదుపరి కవి తనకలాన్ని ఉద్దేశించి "నేడు కవికలం దుఃఖంతో, వ్యాకులంతో ఛిన్నాభిన్నమైపోయింది. అందువలన దానికి ఏడుపు ఎందుకురాదు? కన్నీరెందుకు కార్చదు? ఓ కరుణా! నువ్వు ఈకన్నీటితో సాహిత్యాన్ని తడిపి దాన్ని రసమయంగాచేయాలి" అన్నాడు.

కపటమెరుగని భరతుడు మామగారింటినుండి అయోధ్యకు వచ్చాడు. కైక చెప్పినమాటలన్నీ విని "అయ్యో! ఎంతపని చేశావమ్మా!" అంటూ పడిపోయాడు. శత్రుఘ్నుడు కోపంతో పళ్లు పటపట కొరికాడు. కాని ఎవరిమీద పగదీర్చుకోవాలి?

భరత శత్రుఘ్నుల ఈస్థితిజూచి కైక పిచ్చిదానిమాదిరి కేకలుపెట్టింది.

" ప్రపంచమంతా నన్ను నిందించినాసరే, కుమారా, భరతా! నీపైనగల ప్రేమతోనే నేను ఇలాచేశాను కుమారా, లే, రాజ్యాన్ని చక్కదిద్దు. నేను చిరకాలం నరకయాతనపడ్డా పరవాలేదు. నేనే దైనా పాపంచేసివుంటే, నన్నుదండించు. రాజ్యాధికారం రూపంలో నేనే నీకు ఆశక్తిని ఇస్తున్నాను."

భరతుడు జవాబుచెబుతూ కైకను విషసర్పంగానూ, పతి హంతకురాలిగాను నిందిస్తూ, తల్లులందరూ తమబిడ్డలకు దిష్టితగల కుండా ముఖాన నల్లని తిలకంచుక్క పెడతారు. కాని నువ్వు నా ముఖమంతా మసిపూసి అదే పుత్రప్రేమయని గర్వంగా పలుకు తున్నావు గదమ్మా, ఒకగాడిదనుకూడా తెప్పించు. నాకు ఇప్పుడు అదే సరైన వాహనం" అన్నాడు.

శతృఘ్నుడు కైకను వుద్దేశించి " అమ్మా ! ఈవిషయంలో నువ్వు నన్ను ఎలాదండించినా పరవాలేదు. నేను నా యాన్నే ఆశయిస్తున్నాను. అమ్మా ! నేను నీయొక్క శాసనభారాన్ని ఎంతమాత్రము స్వీకరించజాలను. మనము ఏరాజభక్తినైతే మన శక్తిగా పరిగణిస్తున్నామో, అదేఇప్పుడు విరక్తిగా మారిపోయింది. రాజ్యంయెడల విద్రోహభావన వుండడం ఇతరుల విషయంలో పాప మైతే దాన్నే నావిషయంలో నువ్వు పుణ్యంగా మార్చావు." అన్నాడు కరంగా.

అంతటితో తృప్తిచెందని శత్రుఘ్నుడు ఇంకో అడుగు ముందుకువెళ్ళి "అమా! వాస్తవంలో ఈరాజ్యాధికారాన్నే ఎందుకు రద్దుచేసివేయకూడదు? తద్వారా, ఇందువలన వుత్పన్నమయ్యే లోభము, మదము తొలగిపోతాయిగదా? రాజపదవి అనేదేలేకుండా వుంటే, ఇందుపైన గర్వపడటానికిగాని, దుఃఖపడటానికిగాని అవకాశమే లేదుగదా? ఈవిధంగా ప్రపంచంలో ఒక నూతన శకం ప్రారంభం కావాలి! రాజులంతా తొలగిపోవాలి! ప్రజలంతా సమానులుగా వుండాలి!" అన్నాడు.

శత్రుఘ్నుడి మాటలువిన్న భరతుడు "సోదరా! భోగ్య భావనతోకూడుకొన్న కైక విషదంతాలక్రింద చిక్కివున్న రాజ్య శాసనము తప్పకుండా నష్టమైపోవలసిందే! కాని విద్రోహరహిత మైన రామరాజ్యము చిరకాలం నిలచివుండవలసిందే! నేను కైక యొక్క దుష్టపుత్రుణ్ణి. రఘుమహారాజు, భగీరథుడు, సగరుడు మొదలగువారు ధరించిన కిరీటాన్ని నేను తాకానంటే, నాపాపపు చేతులు కరిగిపోతాయి. లేదా ఆకిరీటం స్వయంగా పశ్చాత్తాపాగ్నికి ఆహుతి అయిపోవచ్చు. సోదరా, ఈరాజ్యము ఎవరికీ స్వంతఆస్తికాదు. దీన్ని రక్షించడానికి త్యాగంచేసేవాళ్ళ సుఖ శాంతులకొరకు మాత్రమే ఈరాజ్యము. రాజసింహాసనానికి నియుక్తుడైన పరిపాలకుడు మరేమీకాకుండా ప్రజాసేవకుడు మాత్రమే అవుతాడు" అన్నాడు.

భరతుడి మాటలువిన్న శతృఘ్నుడు శోకపూర్ణస్వరంతో "ఆర్యా! ఇవాళ దుఃఖంతో నాగుండెలు పగిలిపోతున్నాయి. రాజ్యమువంటి శ్రేష్టమైనవస్తువు ఈనాడు ఇతర వృత్తులవంటి వస్తువయిపోయింది. మన ధరాన్ని వదలుకొని రాజ్యాన్ని పొందడమా? శ్రేష్టమైన రఘువంశంలో ఈనాడు ఈదుష్కార్మ జరిగిపోయింది. ఈశ్రేష్టవంశంలో ఈనాడు రాజ్యంకొరకు సోదరుణ్ణి దేశబహిష్కారంచేశారు. తండ్రిని చంపారు. ఇలాంటి రెండు ఉపద్రవాలు జరిగినచోట, తల్లి కైకను చంపడం, కుటుంబవినాశనం, ఈరెండుకూడా జరిగిపోవాలి. ఇదే నా అలాష. ఓ దౌర్భాగ్యమా, నీదప్పికరిపోవాలి!" అంటూ ఆవీరశతృఘ్నుడు పిడికెళ్ళతో తనగుండెలు తాను బాదుకోసాగాడు.

భరతుడు అతణ్ణి శాంతపరచాడు. ఉభయులు కౌసల్యవద్ద కెళ్ళారు. అపరాధులవలె ఆమెపాదాలమీదపడ్డారు. భరతుని వ్యాకులతనుచూచి దుఃఖాన్ని పొందిన కౌసల్య కైకను నిందించసాగింది. భరతుడు దుఃఖాతిశయమున స్పృహతప్పిపోగా తల్లులిద్దరూ పరిచర్యలుచేశారు. తదనంతరం దశరథుని శవసంస్కారం జరిగింది.

అటుపిమ్మట కౌసల్యాసుమిత్రలు, ఇక తాము జీవించడం వ్యర్థమని భావించడంతో వశిష్టుడు వారికి ఉపదేశంఇస్తూ "రాణులారా! వైధవ్యం మీరు అనుకున్నంత నిస్సారమైందికాదు. అంత

కంటే శ్రేష్ఠమైనభావం ప్రపంచంలో మరొకటి ఏముంది? వైధవ్యం రూపంలో ఆసక్తిరహితమైన అనురాగం, పవిత్రతతో నిండిన అపూర్వసౌభాగ్యం ధన్యమైనది. ఈ వైధవ్యమనేపేరే అగ్నితో కూడింది. అందులో అన్ని భోగలాలసలు భస్మమైపోతాయి. పవిత్రంగా వైధవ్యజీవితం గడుపుతూ, తమ భర్తలను తలచుకొంటూ వుండడం సహగమనంచేయుటకంటే శ్రేష్ఠము. కాబట్టి మీరు ఆవ్రతాన్నే అవలంబిస్తూ జీవితం గడపండి. తద్వారా ధర్మము శక్తివంతమై వికాసాన్ని పొందగలదు. ఒకనాటితో చనిపోవడం బహుతేలిక. కాని దుఃఖాన్ని, కష్టాన్ని సహిస్తూ జీవితం గడపడం బహుకష్టము." అన్నాడు.

తదుపరి వశిష్ఠ మహర్షి అందరినీ వుద్దేశించి "ఇటు చూడండి! అజమహారాజుపుత్రుడు సత్యాన్ని రక్షించడానికి పుత్రుణ్ణి త్యాగంచేశాడు. మళ్ళీ పుత్రప్రేమకు ప్రాణాలనే త్యాగంచేశాడు. ఈవిధంగా ఆ దశరథ మహారాజు సత్యం, శివం, సుందరంతో కూడిన లక్ష్యాన్ని పొందాడు. ఈ మహోన్నత ఆదర్శం మనందరికీకూడా అనుకరణీయం," అని పలికారు.

తర్వాత "సత్యకామసత హై, రామనామ సత్యహై" అన్న గురుఉపదేశాన్ని అందరూ పలికారు. అదేస్వరంతో ఆకాశం ప్రతిధ్వనించింది.

# అష్టమ సర్గ

"ఇప్పుడు మనంవెళ్ళి చిత్రకూటాన్ని దర్శిద్దాం." కవి తన కలాన్ని వుద్దేశించి ఇలా అంటున్నాడు. "ఆస్థానంలో శ్రీరామ చంద్రప్రభువు చరణకమలాలను మన శిరస్సులతో స్పృశించి మన అదృష్టరేఖను సఫలంచేసుకుందాం. ఇప్పుడు సమస్త సాకేతసమాజమూ అక్కడేవుంది. మనదేశం ఎల్లప్పుడూ మనవెంటనే వుంటుంది."

ఈసర్గలో కవి తనకలాన్ని చిత్రకూటం వెళ్ళడానికి పిలుపు నివ్వడంద్వారా, ఈసర్గలో చిత్రకూటవర్ణన జరుగబోతుందని చెప్పినట్లయింది. ఈకవి కావ్యంలోని సమస్త ఘటనలను సాకేతనగరంలోనే చూపించాలనుకున్నాడు. కాని పరిస్థితుల ప్రభావంతో చిత్రకూటాన్ని వర్ణించవలసివచ్చింది. అందుకనే సమస్త సమాజం అక్కడే వున్నట్లు చెప్పాడు.

సీత చిత్రకూటంలోని పర్ణశాలయొక్క పూలమొక్కలకు నీళ్లుపోస్తూవుంది. ఆదృశ్యాన్ని రాముడు నిశ్చల అనురాగంతో చూస్తూవున్నాడు. ఇక్కడ సీతాదేవి సౌందర్యవర్ణన, ఆమె నడకలవర్ణన మనోహరంగా జరిగింది. ఆమె తన మనస్సుతో ఏదో గుసగుసలాడుతూవుంది. తనతండ్రి రాజర్షియై రాజభవనాన్నే ఆశ్రమస్థలంగా మార్చివేస్తే, ఇక్కడ ఈమెకు పర్ణశాలయే రాజ

భవనంగా అనిపిస్తుంది. ఈ చిత్రకూటసభ ఈసర్గ గాకుండా, ఈకావ్యానికే మహత్వపూర్ణ ఘట్టము.

చిత్రకూట ప్రదేశంలో సీతారామలక్ష్మణులు ఆహ్లాదపూర్ణమైన సంభాషణలు జరుపుచుండగా దూరానవస్తున్న గాలిదుమారము, భయంతో పరుగెత్తుచున్న పశుపక్ష్యాదులు కనిపించాయి. భరతుడే సైన్యసమేతంగా వస్తున్నాడని లక్ష్మణుడు ఊహించాడు. రామలక్ష్మణులమధ్య భరతుణ్ణిగురించిన విమర్శ ప్రతివిమర్శలు జరిగాయి. రాముడు భరతునిలో సద్భావననేచూచాడు. ఇంతలో భరతుడువచ్చి రాముని చరణాలమీద పడిపోయాడు. ఆవెంటనే వశిష్టుడు మొదలుగాగల అయోధ్యఅంతా అక్కడ చేరింది. తల్లుల ఆదేశానుసారంగా రాముడు తండ్రిగారి శ్రాద్ధకర్మలు జరిపించాడు.

ఆ రాత్రికి చిత్రకూటంలో సభ ఏర్పాటుచేశారు. ఎవరు ముందు మాట్లాడాలో తోచక కొద్దిసేపు అలాగే వుండిపోయారు. తదుపరి రాముడు మౌనాన్ని భంగపరుస్తూ భరతుణ్ణి అడిగాడు.

"హే భరతభద్ర అబ్ కహో అ ప్సిత అపనా"
"ఓ భరతా, నీఅ ప్సితమేమిటో చెప్పు!"

రాముని గంభీర వచనాలతో సభఅంతా సావధానచిత్తంతో వింటూవుంది. రామునిప్రశ్న భరతుణ్ణి వికలమనస్కుణ్ణి చేసింది. తాను తన బాధాపూరిత మనోభావాలను ఇలా వ్యక్తపరిచాడు.

"ఆర్యా! ఇంకా నా అభీప్సితమేముంది? నాకు నిష్కంటకమైన రాజ్యం లభించిందిగదా? నీకు లభించిందిగదా? నీకు అరణ్యవాసం లభించిందిగదా! ఇంకా నా అభీప్సితమేముంటుంది? ఇందుకే గదా నేనుపుట్టింది! కన్నతల్లి చేతుల్లోనే నా జీవితం అంతమొందింది. నాఇల్లు, నాప్రపంచం అంతా నష్టమైపోయింది. నాముఖం నేనే చూచుకోలేకుండా వున్నాను. ఆర్యా! నాకోరిక ఏమిటో నువ్వే చెప్పు!"

ఈ విధంగా భరతుడు తనను తానే నిందించుకొన్నాడు. ఆత్మగ్లానితో బాధపడే తనకు తనను తాను నిందించుకోవడంలోనే ఊరటకలిగింది.

అంతట రాముడు భరతుణ్ణి తన హృదయానికి హత్తుకొని నవ్వుతూ ఇలా అన్నాడు.

ఉస్ ఆశయ థాహ్ మిలేగీ కిస్‌కో?
జనకర్ జననీహీ జాన్ న పాయీ జస్‌కో;"

"నిన్నుకన్నతల్లియే నీమనస్సు తెలుసుకోలేక పోయిందే, అలాంటి నీఅభీప్సిత మేమిటో ఎవరికి తెలుస్తుంది?"

రాముని ఈమాటలు భరతుడికి ఊరటకల్పించాయి. ఇదే సందర్భంలో కైకకు మాట్లాడానికి అవకాశం లభించింది. ఆమె వెంటనే అందుకొంది,

"రామా! ఈ నీమాటలు నిజమైతే ఇప్పుడు అయోధ్యకు తిరిగి వచ్చేయి. నీమాటలు నిజమే! నేను భరతుణ్ణి కన్నానేగాని అతడిమనస్సు అర్థంచేసుకోలేక పోయాను. అందరూ వినండి, రాముడు ఇప్పుడన్నమాటలు. రామా, నీమాటలు నిజమైతే ఇక ఇంటికి పోదాంపద. నేనే అపరాధిని. అయినా నీతల్లినే గదా! నన్ను అపకీర్తిపాలుచేయడానికి నాఅదృష్టమే ఇలా కపటంగా ప్రవర్తించింది. ఆ అదృష్టమే ఇప్పుడు మళ్ళీ నాతప్పు వొప్పుకొనే శక్తిని నాకు ప్రసాదించింది. వినాశనానికి దారితీసిన మాయా బంధనాలు ఇప్పుడు తొలగిపోయాయి. ఇప్పుడుకూడా నేను నీకు మొదటిలాంటి తల్లినే. నువ్వు నాకు ఆనాటి పుత్రుడవే!"

తన అపరాధాన్ని ఒప్పుకొన్న ఈమాటలకు ఎవరు కన్నీరు కార్చరు? ఆసమయంలో ఆమె ఒక నక్షత్రంమాదిరి దిశలు దీప్తివంతంచేస్తూ అందరి మనస్సుల్లో భయాన్నీ, విస్మయాన్నీ, ఖేదాన్ని కలుగజేసింది. తాను భరతుడిచేత రెచ్చగొట్టబడినదైతే, తన భరతుణ్ణే వొదొలుకుంటానని ఒట్టుపెట్టుకుంది. తనను తాను నిందించుకొంది. తనను మహాస్వార్థము ఆవరించిందనిన్నీ, తరతరాలప్రజలు తన ఈస్వార్థాన్ని తెలుసుకోవాలనీ నిందించుకొంది.

"పుత్రో కుపుత్రో నచ మాతా కుమాతా."

అనే ఆర్యసత్యాన్ని మార్చి తల్లి చెడ్డదైనా, కుమారుడు చెడ్డవాడు కాకూడదని ఆమె సభకు విన్నవించుకొంది. ఇంతకంటే

ఆత్మ నింద ఇంకేముంటుంది! ఇంకా కైక మనస్సు శాంతించలేదు. ఆమె తన పాపానికిగాను యుగయుగాలవరకు తనను తిరస్కరించాలని కోరింది. రఘువంశంలోకూడా ఒక దురదృష్టవంతురాలు వున్నదనినీ, నరులు జన జన్మాలకు ఈమాట జ్ఞాపకం వుంచుకోవాలనీ కోరింది.

కైక ఆత్మగ్లాని పరాకాష్టనందుకొంది. కాని శీలసముద్రుడైన రాముడు తల్లియొక్క ఆత్మనిందను ఎంతవరకు వింటూ వుండగలడు? వెంటనే సభలో ప్రకటించాడు.

"భరతుడిలాంటి సుపుత్రునికన్న
ఆ తల్లి వందసార్లకు కూడా ధన్యురాలు."

రాముని ఆమాటలను ప్రేమోన్మత్తులైన సభాసదులందరూ పలికారు.

ఈమాటలతోనే కైకకు ఎంతోసానుభూతి ల ంచివుంటుంది. ఇక్కడ కవి తన మనస్తత్వశాస్త్రజ్ఞానాన్నీ, అంతర్ దృష్టినీ ప్రదర్శించుకొన్నాడు. రాముని ఈమాటలతో ఆమె నిజంగా ఎంతో గౌరవభావంతో నిండిపోయి వుంటుంది. దీనినే రాముని ప త పావనరూపం అంటారు.

సా త కావ్యంలోని ఈఘట్టం అసాధారణమైనది. ఈ ఘట్టాన్ని చదివిన తరవాత పాఠకుల హృదయాల్లో చిరకాలం నుండి కైకయెడల వుంటూవచ్చిన దుర్భావన నిస్సందేహంగా తొలగిపోయింది.

తదనంతరము రాజ్యాధికారాన్నిగురించి జాబాలిమునికి రాము డికి జరిగిన సంభాషణలో ఈ కవి రాజ య ఆదర్శాలను చక్కగా వర్ణించాడు. రాజ్యంయెడల ఆసక్తికి బదులుగా త్యాగభావన కలి గిననాడే ఆదర్శమైనరాజు అని రాముడు జాబాలికినచ్చజెప్పాడు.

చిత్రకూటానికివచ్చిన అందరి మనస్సులు, అరణ్యంలోని తపస్వికుల దర్శనంచేసుకొని అపూర్వమైన ప్రకృతి సౌందర్యాన్ని చూచి ఎంతో సంతసించాయి.

రాముడు గురుజనులసమక్షంలో నిలబడివుండగా సీత చాలా చాకచక్యంగా లక్ష్మణుణ్ణిపిలచి "ఆర్యా, ఈ సోదరీమణులకు వన కానుకలు ఇవ్వవలసివుంది, కొంచెం కుటీరంలోనికివెళ్ళి దోనెలు పట్టుకరా!'' అంటూ ఆజ్ఞాపించింది. లక్ష్మణుడు ''అలాగే'' నంటూ కమలసంపుటంలోనికి సూర్యకిరణ సమూహం ప్రసరించిన ·తిగా కుటీరంలోనికి ప్రవేశించాడు. కాని లోనికివెళ్ళిచూస్తే ఊర్మిళ ఒకమూలన చిక్కిపోయి రేఖామాత్రంగా కూర్చొనివుంది. భర్తవియోగంలో ఆమె ఎంత క్షీణించిపోయి వున్నదంటే, ఒక్క క్షణకాలం ఆమె ఊర్మిళయేనా? లేక ఆమెనీడ మాత్రమేనా? అని అనిపించింది.

విరహవేదనలోవున్న దంపతులను సీత ఇలాకలపడం కవి ఇక్కడ చూపిన గొప్పతనం.

ఊర్మిళ అక్కడ కూర్చొనివుండడం చూసిన లక్ష్మణుడు ఆశ్చర్యచకితుడై మౌనంగా నిలబడిపోయాడు అతడిని ఆదశలో చూసిన ఊర్మిళ అత్యంత కరుణస్వరంతో "ఓ నాజీవన వనవిహార హరిణమా, నేడు నువ్వు అరణ్యవాసివై స్వేచ్ఛను పొందావు. అయినా ఇప్పుడు నువ్వు నాదగ్గరకురా, నేను నిన్ను బందిస్తానని సందేహించకు. నీమనస్సులోనున్న భయాన్ని తొలగించుకో" అంటూ వేడుకొంది. ఆర్ద్రమైన ఊర్మిళవాక్కులు వినగానే లక్ష్మణుడు పరుగెత్తుకుంటూవెళ్ళి ఆమెకాళ్ళమీద పడ్డాడు. ఊర్మిళ కూడా తన కన్నీటితో భర్తపాదాలను తడుపుతూ స్నేహభావంతో మురిసిపోయింది.

ఊర్మిళాత్యాగాన్ని, బాధను అర్థంచేసుకొన్న లక్ష్మణుడు "ప్రియమైన ఊర్మిళా! నన్ను అరణ్యంలో కొంతసాధన చేసుకొని యోగ్యుడనుగా తయారుకానివ్వు. నీవు వొదినెగారైన సీతకు సోదరివి. నాకు నువ్వు కేవలం భోగ్యవస్తువవు మాత్రమేకాదు." అనగానే ఊర్మిళ వ్యాకులచిత్తంతో "అలాగేస్వామీ! నేను నీతో ఏమేమో చెప్పాలనుకొన్నాను. కాని నాదురదృష్టమేమిటోగాని, ఏమీ చెప్పలేకపోతున్నాను. కాని స్వామీ! ఒక్కమాట, ఏవిషయంలో నీకు సంతోషమో నాకూ అందులోనే సంతోషం"అన్నది.

ఊర్మిళా లక్ష్మణుల ఈకలయిక ఒక్క ఘడియకాలంకూడా పట్టలేదు. ఇంతలోనే బయటినుండి ఏదో శబ్దం అయింది. సీత

అంటూవుంది. "అరరే పూజ్యులైన నా తండ్రిగారుకూడా వచ్చేశారే!" ఈ మాటలు వింటూనే ఊర్మిళా లక్ష్మణులు కుటీరంలో నుండి బయటికి వచ్చేశారు.

ఈసర్గలో ఊర్మిళాలక్ష్మణుల కలయిక ఎంతో ఉదాత్తమైనది.

ఈసర్గలో మరొక విశేషమేమిటంటే, కళంకం ఆపాదించిన పాత్రలన్నీ తమ అపరాధానికి ప్రాయశ్చిత్తం కోరుకుంటాయి. ఈసందర్భంలో లక్ష్మణుడు తన గొప్ప అపరాధాన్ని గుర్తించి భార్య కాళ్ళమీద పడ్డాడు. ఊర్మిళ మహత్తును గుర్తించి, ఆమె ఉదాత్త చరిత్రయెదుట తన అల్పత్వాన్ని గుర్తించినందువల్లనే నన్నుకూడా నీమాదిరి సాధనచేయనిమ్మని యాచించాడు.

ఊర్మిళ భారతీయ నారీ ఆదర్శాన్ని పాటిస్తూ భర్తఆనందమే తన ఆనందమని భావించింది.



# నవమ సర్గ

ఈసర్గ ప్రారంభంలో కవి జనక మహారాజును స్తుతించాడు. ఈసర్గలో ఈకావ్య నాయిక పుణ్యశీలయైన ఊర్మిళాదేవి విరహాన్నే వర్ణించడం జరిగింది. జనకమహారాజు త్యాగ లుడు. అలాగే ఆయనకుమార్తె ఊర్మిళకూడాను.

కరుణరస ప్రధానమైన ఈసర్గలో కవి కరుణరసాన్నే వుద్దేసించి అన్నమాటలు బహుచక్కగా వున్నాయి.

"కరుణే, క్యోం రో హై?
'ఉత్తర్' మేం ఔర్ అధిక్ తూ రోయీ,"
"మేరీ విభూతిహై జో,
ఉస్‌కో 'భవ-భూతి' క్యోంకహేకోయీ?"

"ఓ కరుణా! నీవు ఇంకా ఎందుకింత ఎక్కువగా ఏడుస్తున్నావు? మహాకవి భవభూతి రచించిన ఉత్తరరామ చరితంలో బాగా ఏడ్చి వున్నావుకదా?"

"ఉత్తరరామచరితం"లో భవభూతి కవి కరుణ రసానికే ప్రధానస్థానమిచ్చాడు.

ఒక మనస్తత్వశాస్త్ర సత్యమేమిటంటే, ఎవరైనా దుఃఖంతో ఏడుస్తున్నప్పుడు, వాళ్ళవద్దకెళ్ళి సానుభూతిగా వాళ్ళఏడుపునకు కార

ణం అడిగితే, వాళ్లు ఇంకా ఎక్కువగా ఏడ్వడం మొదలెడతారు. ఇదేవిధంగా కవి కరుణరసంతో దాని ఏడుపునకు కారణం అడిగితే, ఏడుపు తగ్గలేదుగదా! ఇంకా ఎక్కువైపోయింది. అనగా, భావానుభూతి కారణంగా ఏడుపులో తీవ్రతవస్తుంది. కరుణరసం కవి ప్రశ్నకు జవాబుచెబుతూ "నామహత్తును ప్రజలు భవభూతి కవి మహత్తుగా ఎందుకు చెప్పుకుంటారు? నా ఏడుపునకు ఇదేకారణం." అంటుంది.

ఇచ్చట కరుణ, ఉత్తర్, భవభూతి, మాటలు శ్లేషార్థంలో వాడబడ్డాయి.

ఊర్మిళ తన మనస్సు అనబడే మందిరంలో తన ప్రియతముని విగ్రహాన్ని స్థాపించుకొంది. విరహం కారణంగా మండిపోతున్న ఊర్మిళ తాను స్వయంగా హారతి అయిపోయింది.

ఓనాడు తన పెంపుడు చిలుకతో -

"ఓ చిలుకా, నీకు మాటలునేర్పే ఆ ఆచారుడు ఎక్కడికెళ్లాడు? ఎప్పుడుచూసినా నవ్వుముఖంతో వుంటూ, కర్మశీలుడైన నాథ్రర్త ఇవాళ ఎక్కడికెళ్ళాడు?" అని అడగ్గా చిలుక జవాబుచెబుతుందిగదా, "వేటకు వెళ్ళాడు."

"నిజంగా వేటకే వెళ్ళాడా? నిజంగా వేటకే వెళ్ళితే ఆయన అమాయకుడైన వేటకాడై వుండాలి. ఎందుకంటే గాయపడ్డ ఆడ జింక (దుఃఖితురాలైన ఊర్మిళ) ను వదలిపెట్టి ఎక్కడికివెళ్ళాడు?"

(నిపుణుడైన వేటకాడు దెబ్బతిన్న వేటనువదలిపెట్టి ఎక్కడికీ వెళ్లడు.)

ఈసర్గలో ఊర్మిళ విరహాన్ని కవి వివిధ దశలుగా వర్ణించాడు. ఊర్మిళ తన కన్నీటిని గురించి చెబుతూ,

"పహలే ఆంఖోంమేం థే
మానసమేం కూద్ మగ్నప్రియ అబ్ థే,
ఛీంటే వహీం ఉడే థే
బడేబడే అశ్రు వే కబ్ థే? "

నాభర్త తొలుత నాకళ్ళల్లో వుండేవాడు. సంయోగ కాలంలో ఎప్పుడూ ఆయనను చూస్తూవుండేదాన్ని. ఇప్పుడు ఆయన నాహృదయంలోకి దూకాడు; అక్కడే చిందులురేగాయి. ఇవి ఆచిందులు గాని పెద్దపెద్ద కన్నీటి బిందువులు కావు." అన్నది.

తూలిక, పుస్తకము, వీణా, సఖులు - వీరితో తనకాలాన్ని వెల్లబుచ్చుతూ వుండేది. అత్తగార్లు ముగ్గురూ ఆమెదుస్థితిని చూచి ఏడ్చేవారు. మరదులు తలవొంచుకొనేవారు. చిత్రకూటంలో కలుసుకొన్నప్పుడు ఆమెతల్లి జాలిపడి "అయ్యో నాకూతురికి ఇటు వనవాసం, అటు భవనవాసం, రెండూ లేకపోయనే" అంటూ రోదించింది.

ఊర్మిళ అప్పుడప్పుడూ ఊహాచిత్రాలు గీస్తూవుండేది. ఆమె గీసిన ఒకచిత్రంలో, కాళ్లవ ధాటవలసిరాగా సీతారాములు నిల్లబ

వుంటే, లక్ష్మణుడు నీటిలోతు పరీక్షిస్తూవుంటాడు. మరొక బొమ్మలో సీత తన అరికాలిముల్లు తీసుకుంటూ వుంటుంది. ఇంకొకదానిలో రాముడు లతనువంచి పట్టుకుంటే, సీత పూలుకోస్తూ వుంటుంది.

ఊర్మిళ వేదనను, విరహాన్ని పొగడుతుంది. ఒకప్పుడు దీపాన్ని, శలభాన్ని పొగడితే మరోఅప్పుడు చాతకపక్షికేకలువిని కుమిలిపోతుంది. వర్షాకాలపురాత్రి ప్రియతముని ప్రగాఢ ఆలింగనాన్ని, ఋతుపరివర్తనలను, చేపను, భ్రమరాన్ని, నెమలిని, సెలయేళ్ళను, కన్నీటిని మార్చిమార్చి వర్ణిస్తూ సంతృప్తి చెందుతుంది. ఒకమారు మలయమారుతాన్ని చూసి ఇలా అంటుంది:-

"జా, మలయానిల, లౌట్ జా,
యహాఁ అవధికా శాప్,
లగే న లూ హోకర్ కహీఁ
తూ అపనే కో ఆప్"

"మలయమారుతమా వెళ్ళిపో, తిరిగిపో, ఇక్కడ అవధి (గడువు) శాపమువుంది. (గడువు తీరినంతవరకూ నీతో పనిలేదు.) నీవు తిరిగివెళ్ళకపోతే నాశరీరాన్ని తగలగానే నీచల్లదనాన్ని పోగొట్టుకొని నాతాపాన్ని పొందుతావు."

ఒకమారు పుష్పాన్నిచూసి, తన భర్తను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఇలా అంటుంది,

సఖే, జావో, తుమ్ హాఁసకర్ భూల్
రహూఁ మైఁ హాఁసకర్ రో.,
తుమ్‌హారే హాఁసనేమేఁ హై ఫూల్
హమారే రోఁ మేఁ మో-."

"ఓ సఖుడా! నువ్వు నన్ను తల్చుకొని నవ్వుకొని మరచి పోయినా, నేను నిన్ను జ్ఞాపకంచేసుకొని వియోగ వ్యధతో ఏడుస్తూ వుంటాను. నీనవ్వులో పూలురాలితే నా ఏడుపులో ముత్యాలు రాల్తాయి. నీవే నాలక్ష్యము. రాత్రింబవళ్ళు నిన్నే ఉపాసిస్తూ వుంటాను."

మీరా ఒకమారు తన ప్రియతముణ్ణిపొంది ఆయనలో నమైపోవాలనుకుంటుంది. ఒకప్పుడు తన చపలయౌవ్వనాన్ని తన ఒళ్లోని దహొమ నమని చెబుతుంది. ఒకప్పుడు తన వీణావాదనను, తన పియతముడి ప్రేమకలాపాలను జ్ఞాపకం చేసుకుంటూ వుంటుంది.

ఒకమారు తన ప్రియతముడు గడువుకుముందే తిరిగివచ్చి నట్లు భ్రమించి ఆయనకు దూరంగావెళ్లి నిలబడుతుంది. తనపై వా మోహంతో భర్తకర్తవ్యాని భంగం వాటిల్లడం తనకు ఇష్టం లేదని చెబుతుంది. మరొక సందర్భంలో ఇలా అంటుంది.

" డూబ్ బచీ లక్ష్మీ పానీమేఁ,
స ఆగ్ మేఁ పైఠ్
జియే ఊర్మిళా, క ప్ర క్షా,
సహే స ఘర్ బైఠే."

" లక్ష్మి నీళ్లలోదూకి బ్రతికింది. స దేవి అగ్నికి ఆహుతైంది. కాని, ఊర్మిళ బ్రతకాలనీ. ఎదురు చూడాలనీ, ఇంట నుండే కష్టాలను సహించాలనీ" అనుకుంటుంది.

ఈ విధంగా కన్నీరుకారుస్తూ తనగుండెలమీద పెట్టబడిన అవధిశిలను (గడువు అనే బండను) తాను నిరంతరం కార్చే కన్నీటితో కొద్దికొద్దిగా కరగదీస్తూ వుంటుంది. విరహావస్థలో ప్రలాపాలే ప్రధానంగా వుంటాయి. ఈ నవమసర్గ ఇందుకు నిదర్శనము. కవి ఇతర సర్గలకంటే ఈసర్గ ఎక్కువ శ్రమపడ్డాడు.

---

# దశమ సర్గ

ఈసర్గఅంతా స్మృతికావ్యమే. రాత్రి కరిగిపోయినా ఊరి ళకు నిద్రపట్టలేదు. సరయూనది ఒడ్డున్నే ఆమె భవనముంది. ఊర్మిళ గవాక్షమువద్ద నిలబడివుంది. పక్కనే సఖినిలబడివుంది. ఊరి ళ ప్రతిరోజూ రాత్రింబవళ్ళతో, సూర్యచంద్రులతో, నక్షత్రాలతో తన వియోగ ఘడియలను ముడిపెట్టి అనేకమాటలు చెబుతూ వుంటుంది.

ఆనాడు సరయూనదినిచూచి వ్యాకులతతో ఆనదిలో దూకాలనుకుంది. కాని సఖి అడ్డుపడింది. అక్కడేకూర్చొని మహత్వపూర్ణమైన రఘువంశ పరంపరకు సాక్షియైన సరయూనది ప్రాచీన గౌరవాన్ని, అ మానాన్ని, జ్ఞాపకంచేసింది. ఈసరయూనది ఒడ్డున్నే మనువు, అతని మానవధర్మము ఉద్భవించాయి. ఎన్నో విశ్వజిత్‌యజ్ఞాలు జరిగాయి. ఆ గతం ఎంతోగొప్పది.

ఊర్మిళ అటు విదేహరాజ్యపు ఆడుబిడ్డ. ఇటు రఘువంశపు కోడలు. కానినేడు ఆమెలాంటి దురదృష్టవంతురాలు ఎవరున్నారు? తండ్రి ఆమెకు సామ సంహిత నేర్పుతూవుండేవాడు. స్వాభావికంగా కొంత చంచల స్వభావంకలది. సరయూమాదిరే తేలియాడుతూ తిరుగుచుండేది. శ్రుతకీర్తి, మాండవీ తాళంవేస్తూ నాట్యం చేసేవారు. పెద్దసోదరి సీత పాట తయారుచేసేది.

మిథిలలోని కమలానదిలో తిమింగిలాలు, చంచలమీనాలు, ఆమెకు జ్ఞాపకంవస్తాయి. కమలానదివొడ్డున ఆమె తన సఖులతో శంఖపుచిప్పలతో ఆడుకుంటూ వుండేది. వాళ్లంతా కూడా ఇప్పుడు అత్తవారిళ్ళకు వెళ్ళారు. ప్రక్కనేవున్న ఉద్యానవనం అందు లోని గిరిజామందిరం, చెరువులు, బావులు, కలకల నినాదంచేసే పక్షిసమూహం, ఎగి సీతాకోకచిలకలు, తన చంచలబాల్యము ఆమెకు జ్ఞాపకంవస్తాయి. పూజ వేళయందు తల్లితో వినోద వార్తలు, ఉమాశంకరులకథ, సీత హరువిల్లు ఎత్తడం, తండ్రి జన కుడు ఆమెపైన ముగ్ధుడుకావడం, తల్లి వరుడివిషయం గురించి దిగులుపడడం, తదువరి శ్యామ గౌర వర్ణయువకులు రావడం వాళ్ల ర్తికథ, వాళ్ళు పూలుకోయడం, సీత ముగ్ధురాలుకావడం లక్ష ణునియెడల తనప్రేమ, అన్నీ తన కళ్లయెదుట కది లాడుతాయి.

తదుపరి రాజకుమారులంతా ధనుర్భంగానికి ప్రయత్నించి ఓడిపోవడం, జనకుడు నిరాశచెందడం, లక్ష్మణుడు సింహగర్జ చేయడం, రామధనుర్భంగం, పరశురాముని కోపతాపాలు, లక్ష ణుడు ఆయనతో వాదించడం, అన్నీ చలన చిత్రంమాదిరి కను స్తాయి. పెళ్లివారువస్తారు. అట్టహాసంగా పెళ్లిజరిగిపోతుంది తల్లినివదలి అత్తగారింటికి వస్తుంది. తన వంశాచారానికి తానెంత గర్విస్తుంది,

సాకేతసౌరభము

ఒకవేళ లక్ష్మణుడు రాముని వెంట వనవాసానికి వెళ్లకుండా ఇంటివద్దనే వుండివుంటే, తానే అతనికి 'దుర్బలు'డనే బిరుదు ఇచ్చి వుండేదాన్నని అనుకుంటుంది.

సరయూనది గుట్టుగా సముద్రుణ్ణి కలవడానికి సాగిపోతూ వుంటే, తాను బంధనాల్లో పడివుంది. తనువుతో కాకపోయినా మనస్సుతో ఆమె భర్తవెంటనేవుంది. అటు ఆకాశాన నక్షత్రాలు, ఇటు ఊర్మిళ కన్నీటిబిందువులు రాల్తాయి. సఖి ఆమెను తన వాళ్లోకి తీసుకొంటుంది. ఆమె నిద్రలోకి జారుతుంది.

# ఏకాదశ సర్గ

భరతుడు, మాండవీ, శతృఘ్నుడు అందరూ నంది గ్రామంలో కూడతారు. కుటుంబ సమస్యలపైన, రాజ్యసమస్యలపైన సంప్రతింపులు జరుగుతాయి. మాండవి భరతునికి ఫలహారాల పళ్లెంతెస్తుంది. కాని ఊర్మిళ కష్టాలనుచూచి తాను ఉపవాసం చేయ సంకల్పిస్తాడు భరతుడు. ఆత్మగ్లానితో కరగిపోతాడు

మాండవి అతని సోదరప్రేమను, అతని త్యాగాన్ని, కష్ట సహానాన్ని జ్ఞాపకంచేసి, అతణ్ణి ఓదారుస్తుంది. శతృఘ్నుడు రాజ్యంలో ధనధాన్యాల కళాకౌశలాల సమృద్ధిని కొనియాడుతూ ప్రజలు రామునికొరకై ప్రేమకానుకలు ఒనగూర్చుకొంటున్నట్లు వర్ణిస్తాడు. ఆ సందర్భంలోనే తాను ఒకమనిషిద్వారావిన్న దక్షిణ ప్రాంతపు సమాచారంకూడా భరతునకు వినిపిస్తాడు. అందులో రాముడు దండకారణ్యంలో గోదావరినదివొడ్డున ఆశ్రమం కట్టుకొని వుండడం, శూర్పణఖ వృత్తాంతం చెబుతాడు.

ఇంతలో భరతుడికి ఆకాశమార్గాన ఎవరో మాయావి రాక్షసుడు పోతూవున్నట్లు కనిపిస్తాడు. వెంటనే అతనిమీద బాణం వొదుల్తాడు. "హా లక్ష్మణా! హా సీతా!" అంటూ హనుమంతుడు వాళ్లముందరే పడిపోతాడు. మాండవీ భరతులు శుశ్రూషలు చేసి, ఎవరోయోగి కానుకగా ఇచ్చిన సంజీవనిని ప్రయోగింపగా

హనుమంతుడు తేరుకుంటాడు. పిమ ట తాను ఎవరై నదీ వివరిస్తూ, మాయామృగము, సీతాహరణము, జటాయు మరణం, సుగ్రీవ మై , వాలివధ, సీతాన్వేషణ, లంకాదహనం, సేతుబంధనం, లంకాయుద్ధం, ఇత్యాది సమాచారం సంక్షిప్తంగా వినిపించి, లక్ష్మణుని మూర్ఛవిషయంచెప్పి, సం వని కోసం తాను బయలుదేరి వచ్చిన విషయంకూడా చెబుతాడు. సం వని ఔషధం భరతుని వద్దనేవున్నది కాబట్టి దాన్ని తీసుకొని హనుమంతుడు లంకవేపు ఎగిరిపోతాడు.



# ద్వాదశ సర్గ

భరతుడు సీతాపహరణ విషయం వినడంతో దెబ్బతిన్న తన ఆ మానాన్ని తానే నిందించుకోసాగాడు.

"భారతలక్ష్మి పడీ రాక్షసోం బంధన్ మేఁ,
సింధుపార్ వహ్ విలఖ్ రహీ హై వ్యాకుల మనమేఁ,
బైఠా హూఁ మైఁ భండ్ సాధుతా ధారణ్ కర్ ,
అపనే మిథ్యా భరత్ నామ్‌కో నామ్‌మన ధర్ కే."

"భారతలక్ష్మి రాక్షసుల బంధనాల్లో పడిపోయింది. సముద్రపుఅవల ఆమె వ్యాకులచిత్తంతో రోదిస్తూవుంది. నేను ఇక్కడ ఆడంబరంగా సాధువునై భరతుడనే మిథ్యానామాన్ని ధరించి కూర్చున్నాను."

భరతుడు తాను లక్ష్మణుని బాటనే బాటసారి కాబోతున్నానని ఊర్మిళకు సందేశం పంపుతాడు శత్రుఘ్నుడు భరతుని ఆదేశానుసారం వీర రసావతారమై రాజతోరణంవద్దకు వచ్చేస్తాడు. మాండవిద్వారా సమాచారమంతా అంతఃపురంలో తెలిసిపోతుంది. అందరిపైన పిడుగుపడ్డట్లు అవుతుంది. శత్రుఘ్నుడు తల్లులను శాంతపరచి వారి ఆశీర్వాదాన్ని పొందుతాడు.

కైక తన కన్నీటిని బలవంతంగా ఆపుకొని, ముందు భరతుణ్ణి వెళ్లమంటుంది. అత వెంటనే తాను వెళ్లాలంటుంది

కాని శతృఘ్నుడు ఆమెను ఇంటివద్దనే వుండమంటాడు. కాని కైకకు గర్వించతగిన తనగతం గుర్తుకువచ్చి ఇలా అంటుంది.

"మైఁ నిజపతిసంగ గయీ థీ అసురసమరమేఁ,
జావుంగీ అబ్ పుత్ర - సంగథీ అరిసంగరమేఁ."

"రాక్షస సంహారంలో నేను భర్తవెంటవెళ్లాను. ఇప్పుడు శతృసంహారానికి కుమారునివెంట వెళ్తాను."

శతృఘ్నునినోట భరతుని సందేశాన్ని విన్న ఊర్మిళ శతృఘ్నుని నుదుట తిలకం దిద్దుతుంది. శృతకీర్తి అతని పాద ధూళి తీసుకొని సాగనంపుతుంది. శతృఘ్నుడు ముందు శంఖం పూరిస్తాడు. వెనువెంటనే భరతుడు, ఆవెనుక అసంఖ్యాకమైన శంఖాలు ధ్వనిస్తాయి. భర్తలవెంట పురుషవేషాల్లో భార్యలుకూడా వెళ్లడానికి సిద్ధపడతారు. చతురంగబలం తయారవుతుంది. ఆటు ఊర్మిళకూడా రణరంగంలో సహాయపడటానికి సిద్ధపడుతుంది.

అంతలోనే వశిష్టుడువచ్చి ఆకాశంవేపు చూపిస్తాడు. చలన చిత్రంమాదిరి లంకావిజయం కనబడుతుంది. ఊర్మిళ సంతుష్టి చెందుతుంది. ఇంతలో రాముడు వచ్చేస్తాడు. రాణులు సంత సిస్తారు. కోడళ్లు సంబరపడతారు. సఖులంతా ఊర్మిళను అలంక రించి ప్రేమా సార మార్గాన నిలబెడతారు. కాని ఆమెకు కొంత సంకోచం కలుగుతుంది. ఆమె ఇలా అంటుంది.

"పర్ యౌవన్ - ఉన్మాద్ కహాఁసే లావుంగీ మైఁ?
వహ్ ఖోయాధన్ ఆజ్ కహాఁ స, పావుంగీ మై?

"కాని ఆయౌవనపొంగు యెక్కణ్ణుంచి తెచ్చేది? పోయిన ఆ యౌవనధనం ఇవ్వాళ ఎక్కణ్ణుంచి వస్తుంది?"

ఈవిధంగా ఈసర్గతోబాటు సాకేత మహాకావ్యం పరిసమాప్తమవుతుంది.



# శ్రీ మైథిలీశరణ్ గుప్త

శ్రీ మైథి శరణ్ గుప్త ఉత్తరప్రదేశ్ లోని ఝూన్సీజిల్లాలో చిరగాంవ్ గ్రామంలో క్రీ. శ. 886 లో జన్మించాడు. ఈయన తండ్రిపేరు రామచరణదాస్. ఈయన గొప్ప భగవద్భక్తుడు. గుప్తగారికి తండ్రినుండే రామభక్తిసంస్కారం ల ంచింది. పదు నైదేళ్ళప్రాయంలోనే ఈయన కవిత్వం వ్రాయడం మొదలెట్టాడు. ఈయన సంస్కృతము, బెంగా , ఇంగ్లీషు, ఉర్దూ భాషలు బాగా అధ్యయనంచేశాడు. శ్రీ మున్షీఅజ్మేరీ, ( మహావీర ప్రసాద్ ద్వివేదీగారలు వీరి కవితాగురువులు పిన్నవయస్సులో ప్రాచీన సంస్కృత, హిందీ కావ్యాలన్నిటినీ చదివాడు.

895 లోనే ఈయన ప్రథమవివాహం చేసుకొన్నాడు. ఆవిడ 903 లో చనిపోయింది. 1904 లో ద్వి యవివాహం చేసుకొన్నాడు. కాని దురదృష్టవశాత్తూ ఆమె వివాహానంతరం ఎనిమిదేళ్ళ చనిపోయింది. అప్పుడు ఈయన హృదయం తల్లి డిల్లిపోయింది. కాని పెద్దవాళ్ళ వత్తిడివలన 28 ఏళ్ళవయస్సులో మూడవపెళ్ళి చేసుకొన్నాడు. ఆవిడవలన తొమ్మి దిమంది సంతానంకలిగారు. అందులో చివరిపిల్లవానికి ఊర్మిళాచరణ్ అని పేరు పెట్టాడు.

ఈయన జాతీయవాది. స్వతంత్రపోరాటంలో తరచూ పాల్గొనడంద్వారా అనేకమార్లు జైలుకెళ్ళాడు. ఈయన కావ్యాల్లో ఎక్కువ భాగం జైల్లోనేవ్రాశాడు. 1948 లో ఆగ్రా విశ్వవిద్యాలయం ఈయనకు డి. లిట్; బిరుదమునిచ్చి సత్కరించింది. 954 లో భారతప్రభుత్వం 'పద్మభూషణ్' బిరుదముతో గౌరవించింది. అదే సంవత్సరం ఆయన కాశీవిశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్ గా నియుక్తుడయ్యాడు. 1952 మొదలు 9 లో చనిపోయినంతవరకు భారత రాజ్యసభలో నామినేటెడ్ సభ్యులుగా వుంటూవచ్చారు.

ఈయన మొత్తం నలభై పద్యకావ్యాలు, మరికొన్ని అనువాద కావ్యాలు వ్రాశాడు. వీరికావ్యాల్లో మహాకావ్యంగా ప్రసిద్ధి చెందినది 'సాకేత్'. వీరి ఇతర కావ్యాల్లో జయద్రథవధ, భారత భారతి, శకుంతల, పంచవటి, సైరంధ్రి, బకసంహార్, యశోధర ద్వాపర్, జయభారత్, మొదలగునవి ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి.

# యశోధర

'యశోధర' కథావస్తువు సిద్ధార్థుని మహా నిష్క్రమణం నుండి ప్రారంభమవుతుంది. కరుణాపూర్ణ శుద్ధబుద్ధ భగవానుడు కపిలవస్తునగరం తిరిగి రావడంతో, యశోధర 'బుద్ధం శరణం గచ్ఛామి' అనడంతో కావ్యం సమాప్తమవుతుంది. ఈమధ్య కాలంలో కవి గౌతమబుద్ధుని వెంటగాకుండా 'రాహుల్‌జనని' యశోధరవెంటనే వుంటాడు. కరుణాపూర్ణమైన యశోధరకథను వర్ణించడమే కవియొక్క ఉద్దేశ్యము. ఈకావ్యంలో యశోధర విరహిణిగాను, జననిగాను, అ మానవతిగాను దర్శనమిస్తుంది.

యుగయుగాలనుండి స్త్రీజాతియెడల నిర్లక్ష్యం చూపించ బడుతూ వచ్చింది. స్త్రీని హేయంగా చూస్తూవచ్చారు జగత్తులో సగంస్థానం ఆక్రమించివున్న స్త్రీకి మానవ హృదయంలో ఏదైనా స్థానం అంటూ వుంటే, అది స్వార్థంపైన ఆధారపడిందో లేక దయాపూరితమైందో అయివుంటుంది. ఏజాతి సాహిత్యాన్ని ఎత్తిచూచినా స్త్రీపట్ల పురుషుని రాక్షసకృత్యాలే కనబడ్తాయి. స్త్రీ యెడల ఇంత తుచ్ఛమైన ఆలోచనవుండే పురుషుల ప్రవృత్తిని ఎదిరించడానికే ఈ యశోధర కావ్యం పీడిత స్త్రీజాతికి ప్రాతినిధ్యం వహిస్తూ అవతరించింది.

ఇందులో సిద్ధార్థుడు ప్రపంచాన్ని క్షణభంగురంగా తలచాడు. అదే అర్థంలో దాన్ని త్యజించాడు. అతడు భౌతిక బాధలనుచూచి పారిపోలేదు. దాన్ని సారరహితంగా గ్రహించి వదలివేశాడు.

పతి పరిత్యక్తయైన యశోధర హృదయావేదనను వెల్లడించడంతోబాటు వైష్ణవ సిద్ధాంతాలను సుస్థాపితంచేయడం ఈకావ్య ఉద్దేశ్యంగా కానవస్తున్నది. మంగళాచరణ్, సిద్ధార్థ, మహానిష్క్రమణ్, నంద, మహాప్రజావతి, శుద్ధోధన్, పురజన్, ఛందక్, సంధాన్, బుద్ధదేవ్ శీర్షికలతో వ్రాయబడిన పదిసర్గలు, మరియు 'యశోధర'; 'రాహుల్‌జననీ' శీర్షికలతో మార్చిమార్చి వ్రాయబడిన మరో పదిసర్గలు, మొత్తం ఇరవైసర్గల్లో గద్యపద్యమయంగా వ్రాయబడిన చంపూకావ్యం ఈ 'యశోధర.' విప్రలంభ శృంగారం ఇందులోని ముఖ్యమైన రసం.

ఈ కావ్యరచయిత శ్రీ మైథిలీశరణ్‌గుప్తగారు జన్మతః వైష్ణవులు. ఆయన మనస్సులో వైష్ణవభావనలు గూడుకట్టుకొని వుండిపోయాయి. వారి కుటుంబసభ్యుల్లో రామచరణ్, సియారామశరణ్, ఊర్మిళాచరణ్ మొదలుగాగల పేర్లువున్నాయి. ఇట్టి స్థితిలో ఈ కవి తన కావానికి బౌద్ధ కథావస్తువు నుకొన్నను అందులో వైష్ణవభావనను సమావేశపరచాడు. కవి స్వయంగా రామభక్తుడు. అందువలన ఈకావ్య ప్రారంభంలో రాముణ్ణి వేడుకొన్నాడు. బౌద్ధ ధర్మభావనకు వ్యతిరేకంగా ముక్తికిమారుగా భక్తినే కోరాడు.

'మంగళాచరణం'తో కావ్యం ప్రారంభమవుతుంది. కవి రాముడిలో, బుద్ధుడిలో ఐక్యత దర్శిస్తాడు. బుద్ధుడు దశావతారాల్లో ఒకడుగాబట్టి ఉభయుల్లో అభేదాన్ని పాటిస్తాడు. తనను ఎల్లప్పుడు భారతదేశంలోనే జన్మింపచేయమని కవి రాముణ్ణి ప్రార్థించాడు.

తదుపరిసర్గ 'సిద్ధార్థ' పేరుతో వ్రాయబడింది. ఇందులో మహా నిష్క్రమణానికి పూర్వపు బుద్ధుని మానసిక చింతనగురించి వర్ణింపబడింది.

తదుపరిసర్గలో "మహా నిష్క్రమణ" పేరుతో బుద్ధుడు భార్యాపుత్రులనువదలి అరణ్యాలకు వెళ్ళడం చెప్పబడింది. ఈసర్గ చివరన సిద్ధార్థుడు రాముణ్ణిస్మరిస్తూ "ఓ రామా! నీవంశంలో జన్మించిన ఈ సిద్ధార్థుడు ఇవాళరాత్రికి ఇల్లువదలి అడవికి వెళ్లనున్నాడు. నీవు ఇతని నమస్కారాన్ని స్వీకరించి సఫలమనోరథుడయ్యేటట్లు ఆశీర్వదించవలసింది" అంటాడు.

రాముడు అడవికివెళ్లాడు. సిద్ధార్థుడుకూడా అడవికివెళ్లాడు. కాని ఉభయుల అరణ్యవాసాలకుగల పరిస్థితులు న్నమైనవి. రాముడు పితృఆజ్ఞపాటించడానికి అడవికివెళ్లితే సిద్ధార్థుడు మోక్ష ప్రాప్తికొరకు అడవికివెళ్ళాడు. తదుపరిసర్గ 'యశోధర' శీర్షికన వ్రాయబడింది. యశోధర నిద్రపోతూవుండగా సిద్ధార్థుడు మోక్ష ప్రాప్తికొరకు ఆమెను వదలి వెళ్తాడు. యశోధర నిద్రలేవగానే

సిద్ధార్థుడు కనుపించకపోవడంతో ఆమెమనస్సు వుద్విగ్నమవుతుంది. అమంగళసూచకంగా ఆమె ఎడమకన్ను అదురుతుంది. ఒక్కమారు ఆమెమనస్సు గతంలోకి పరుగెత్తుతుంది. ఒకప్పుడు తాను భర్తను ఒకప్రశ్న అడిగింది. "నేను నిన్ను 'ప్రాణవల్లభు' డని అందునా లేక 'స్వామీ' అని పిలుతునా?" అందుపై సిద్ధార్థుడు "నీస్వామినైన నేను యోగీశ్వరుణ్ణి ఎందుకుకాకూడదూ?" అని అన్నాడు.

యశోధర తన సఖితో ఇలా అంటుంది.

"సిద్ధిహేతుస్వామిగయే, యహ్‌గౌరవ బాత్,
పర్ చోరి - చోరిగయే, యహీబడా వ్యాఘాత్."

"నాభర్త సిద్ధిప్రాప్తికొరకు వెళ్ళాడు. ఇది చాలా గౌరవప్రదమైన విషయం, కాని ఆయన దొంగతనంగా వెళ్ళాడు. అందుకనే నాకెంతో బాధగావుంది. ఆయన మోక్షప్రాప్తికొరకు వెళ్తున్నానని నాతోచెప్పి వెళ్ళితే, నేను సంతోషంగా పంపించివుండేదాన్ని. ఏవిధంగాకూడా నేను ఆయన మార్గానికి అడ్డుతగిలేదాన్నికాదు."

ఇక్కడ యశోధర నారీ గౌరవం దీప్తిచెందింది. ఆమె స్వయంగా రాజకన్య. కాబట్టి ఇలా అంటుంది -

" తమ భర్తలను స్వయంగా అలంకరించి యుద్ధభూమికి పంపేది మాస్త్రీలేకదా? నాస్వామివెళ్ళితే వెళ్ళాడు, ఆయన సుఖంగా

మోక్షం పొందాలి. నాదుఃఖాన్ని గురించి ఆయనకు దుఃఖంకలుగ రాదు."

అటుపైసర్గ "నంద" పేరుతో వ్రాయబడింది. నందుడు సిద్ధార్థునికి సవతితల్లి కుమారుడు. సిద్ధార్థుడు అడవులకు వెళ్ళడంతో రాజ్యభారం తనమీద పడిందని వాపోతాడు. నందుని ఈబాధ భరతునిబాధకు ఏమాత్రం సిపోదు.

తదుపరిసర్గ 'మహాప్రజావతి' ర్షికన వ్రాయబడింది. సవతి తల్లియైన మహాప్రజావతి మానసికవేదన ఇందులో వర్ణించబడింది. సిద్ధార్థునికి జన్మనిచ్చినతల్లి వెనువెంటనే పరలోకాన్ని చేరుకొంది. అప్పటినుండి మహాప్రజావతియే అతణ్ణి కన్నబిడ్డగా కాచి పోషించింది. ఆమె తన స్వంతకుమారుడైన నందునికీ సిద్ధార్థునికీ ఏమీ తేడా చూపలేదు. ఆమె తన దురదృష్టాన్ని నిందించుకుంటూ తన బిడ్డ అడవుల్లో ఏఏకష్టాలకు గురికావలసి వస్తుందోనని వాపోతుంది. "అరణ్యవాసంమాట వినగానే ప్రజలు దూషించి నన్ను వ్రేకతో పోలుస్తారుగదా! నాకారణంగానే నీవు అడవులకు వెళ్లావని అంటారుగదా! దీంతో నాదుఃఖం ద్విగుణీకృతం అవుతుందిగదా! పుత్ర వియోగంతో ఒక దుఃఖం అనుభవిస్తూనేవున్నాను. ఇకపైన నిందారోపణ కారణంగా మరో దుఃఖంకూడా కలుగుతుంది. కుమారా! ఈ దుఃఖాన్నంతా నేను ఎలా సహించేది? నేను మరణానంతరం నీకు జన్మనిచ్చిన తల్లివద్దకు చేరినప్పుడు ఆమెకు ఏమి జవాబు

చెప్పనూ? కుమారా! నన్ను ఈ వృద్ధావస్థలో నిస్సహాయురాలిని చేసివెళ్ళడం నీకు భావ్యమేనా?" అంటూ విలపిస్తుంది.

అటుపైసర్గ 'శుద్ధోధన్' పేరుతో వ్రాయబడింది. సిద్ధార్థుని కన్నతండ్రి శుద్ధోధనుడి పుత్రవియోగం ఇందులో వర్ణించబడింది. సిద్ధార్థునికి ఈస్థితిరాకుండా వుండాలనే తాను ఎన్నో ప్రయత్నాలు చేస్తూవచ్చాడు. కాని చివరకు తన ప్రయత్నాలన్నీ విఫలమైపోయి నందుకు చింతిస్తాడు. ఈ సర్గలో యశోధరాశుద్ధోధనులమధ్య సంభాషణ జరుగుతుంది.

"ఇప్పుడు నన్ను ఏమిచేయమంటావు?" అన్న శుద్ధోధనుని ప్రశ్నకు యశోధర ఒక భార యనారివలె జవాబిస్తుంది. "ఇక మనమంతా మనఃపూర్వకంగా ఆయనలక్ష్యం నెరవేరాలని కోరడమే మంచిది. తద్వారా ఆయన మోక్షంపొంది తిరిగి రాగలుగుతాడు."

తదుపరిసర్గ 'పురజన్' పేరుతో వ్రాయబడింది. సిద్ధార్థుడు అడవులకు వెళ్ళాడని తెలియగానే పురప్రజలంతా రాముడు అడవులకు వెళ్ళినప్పుడు అయోధ్యావాసులు విలపించినట్లు విలపిస్తారు. వాళ్లు అనేకరకాలుగా తమ దురదృష్టాన్ని నిందించుకుంటారు.

తదుపరిసర్గ 'ఛందక్' శీర్షికన వ్రాయబ ంది. ఛందకుడు సిద్ధార్థుని రథసారధి. ఈసర్గలో సిద్ధార్థుని స్థితినిగురించి, ఆయన సందేశాన్నిగురించి ప్రస్తావించబడింది.

సిద్ధార్థుడు సన్యాసికావాలనుకుంటున్నాడు. అందుకనే సమస్త రాజ్యాన్ని, వస్త్రాలంకరణలను పరిత్యజించి అడవులకువెళ్ళి సన్యాసం స్వీకరించాడు. అందమైన తన శములను కత్తిరించివేశాడు. తన సందేశాన్ని చెబుతూ - నన్నుగురించి ఎవరూ దిగులుపడవద్దు. నేను మోక్షాన్ని పొందిన మీదటనే తిరిగివస్తాను. ఈజన్మ మరణాల దుఃఖాన్ని నేను సహించజాలను. మీరంతా నావారు. ప్రతి ప్రాణికి మేలుకలుగజేయడమే నాఉద్దేశం.'' అన్నాడని ఛందకుడు వినిపించాడు.

తదుపరిసర్గ యశోధర పేరుతో ప్రారంభమవుతుంది. ఇందులో కథాగమనంనిలచిపోయి యశోధర విరహం వివరించబడింది.

తన ప్రియతముని విరహంలో యశోధర కళ్లు నిరంతరం అశ్రుధారలు కురిపిస్తూనే వుంటాయి: వాటిని ఆమె తనకళ్ళకు అలంకారంగా భావిస్తుంది. క్రమక్రమంగా ఆమెకు తన పూర్వస్మృతులు జ్ఞప్తికివస్తాయి. వాటితో ఆమెయొక్క మానసిక క్లేశము మరింత ఎక్కువవుతూ వుంటుంది. అందువలన వాటిని మరచిపోవాలని ప్రయత్నంచేస్తుంది. కాని సాధ్యపడదు. చనిపోవాలనుకుంటుంది. కాని చావజాలదు. ఎందువల్లనంటే, భర్తకు ప్రతిరూపమైన రాహులుని పోషణభారం ఆమెమీదవుంది.

విరహసముద్రంలో మునిగిపోయే యశోధర తనకుతాను ధైర్యంతెచ్చుకోడానికి ప్రయత్నంచేస్తుంది. తనను తాను సంబో

ధించుకొని - "పుష్పానికంటే కోమలమైన ఓనారీ! ఇప్పుడు నీవు వజ్రానికంటే కఠోరంగా తయారుకావాలి. ఆర్యపుత్రుడు తనను పరీక్షించుకొన్నాడు. ఇప్పుడు నిన్ను నీవు పరీక్షించుకోవలసిన సమయం ఆసన్నమైంది." అంటుంది.

ఆమెలో స్వాభిమానం జాగృతమవుతుంది. "నాథా! ఒక వేళ నీకు స్త్రీసామాన్యంపట్ల విరక్తివుంటే, ఏముక్తికొరకైతే నీవు వెళ్ళావో అందులోకూడా నారీత్వమువుందిగదా! స్త్రీని ముక్తిమార్గానికి అడ్డంకుగా భావిస్తే, ఇక ఆమెకు రక్షణఎవరు? ఆమె ఏమార్గాన్ని అవలంబించగలదు? స్త్రీ సగం ప్రపంచంలో వ్యాపించివుంది. ఆమెకు కూడా ఆలోచనాజ్ఞానంవుంది. ప్రపంచం స్త్రీని అనాథగా తలవడంబాగలేదు. ఎందుకంటే, ఆమెకుకూడా రక్షకుడు ఈశ్వరుడు వున్నాడు. పతివ్రత అయిన స్త్రీ ప్రపంచంలో ఎంత భారాన్నయినా మోయగలదు." అంటుంది యశోధర.

ఆమె ఒక ఆదర్శ భారతీయనారివలె తన భర్తను దైవంగా భావిస్తుంది. తనను ఒక భక్తురాలిగా భావిస్తుంది. అందువలన ఆమె తనస తో ఏమంటుందంటే, "ఓ స , నిజమైనభక్తుడు భగవంతునివద్దకువెళ్లడు. భగవంతుడే కదిలి భక్తునివద్దకు వస్తాడు."

యశోధరకు తాను నిజమైన భక్తురాలననే నమ్మకంవుంది. ఆమె సిద్ధార్థుని కలుసుకోడానికి అడవులకువెళ్లదు. ఆయనే తన

వద్దకువస్తాడని నమ్ముతుంది. ఏదో ఒకనాడు తన ఆరాధ్యదైవము తన ఇంటిముంగిటకు వస్తాడని నమ్ముతుంది.

తన వియోగ ప్రేలాపాలలో ఒకమారు యశోధర తన హృదయాన్ని ఇలా చీవాట్లు పెడుతుంది. "ఓ హృదయమా! నీవు నిజంగా చాలా కఠోరమైనదానివి. ఎందుకంటే, ప్రాణ రహితమైన దానిమ్మపండుకూడా తన అంతర్యాన్ని చూపించడానికి పగిలిపోతుంది. కాని నీవు నిన్నుచీల్చుకొని నీప్రేమను ప్రియత ముడికి చూపించలేకపోయావు!"

ఒకమారు యశోధర తన సఖిని వుద్దేశించి, "ఓస , ఒకప్పుడు నేను నామనస్సు అనే సరోవరానికి రాజహంసలా వుండే దాన్ని. అంటే నా ప్రియతముడు నన్ను ఎక్కువగా ప్రేమించే వాడు. ఆయన ప్రేమను పొందిన నేను మానససరోవరంలోని రాజ హంసమాదిరి నా అదృష్టానికి హద్దులేనంతగా మురిసిపోయేదాన్ని. కాని అవన్నీ ఇప్పుడు కలలుగా మారిపోయాయి. ఇప్పుడు ప్రియ తముని తపస్సు నాసరస్సులోని నీటిని పీల్చివేసింది." అంటూ తన విరహవ్యధను ప్రకటిస్తుంది.

తదుపరిసర్గ 'రాహుల్ జననీ' శీర్షికన వ్రాయబడింది. ఈ సర్గలో యశోధర మాతృస్వరూపం చక్కగా వర్ణించబడింది, భర్త చెంతలేక బిడ్డను పోషించవలసివచ్చిన తల్లి మానసికస్థితి ఎలా వుంటుందనేది ందులోని ప్రత్యేకత.

రాహుల్ ఎప్పుడైనా ఏడ్వడం మొదలెడితే, ఆతల్లి అంటుందిగదా! "నోరుమూసుకోరా! నీతండ్రి వెళ్లిపోయేప్పుడు ఇలాగే ఏడ్చివుంటే, ఆయన అసలు నన్ను వదలిపెట్టి వెళ్లేవాడు కాదుగదా! దేవుడు నన్ను ఏడ్వడానికేపుట్టించాడు. నీవెందుకు ఏడ్వడం? నీకు రోజూ పాలుతాపడానికి నేనున్నానుగదా! ఆయన సిద్ధిపొంది తిరిగి వస్తే నేను ఆయనకు కన్నీటితోనే స్వాగతం పలుకుతాను."

ఈ సందర్భంలో ఈకవివ్రాసిన ఈక్రింది వాక్యాలు ఎంతో స్వాభావికంగానూ, భావగర్భితంగానూ వున్నాయి.

"అబలాజీవన, హాయ్! తుమ్హారీ యహీ కహానీ,
ఆంచల్‌మేఁహైదూధ్ ఔర్ ఆంఖోంమేఁపానీ."

"స్త్రీ వితం ఒకవేపు తనబిడ్డలను పోషించడంలో నమైతే, మరోవేపు 'విరహబాధతో కన్నీరుకార్చవలసి వస్తున్నది. ఒళ్ళో బిడ్డకు పాలిస్తూవున్నా కళ్ళల్లోనీళ్ళు తిరుగుతూనే వుఁటాయి. అయ్యో! అబలలజీవితపుకథ అంతా ఇంతేగదా!" ఈరెండు వాక్యాలలో స్త్రీ జీవితపు మర్మమంతా ఇమిడివున్నది.

కుమారుని బాల్యచేష్టలుచూచి యశోధర మురిసిపోతూ వుంటుంది. పిల్లవాని తప్పటడుగులు ఆమెకెంతో బాగుంటాయి. "కుమారా! నువ్వు నావేలుపట్టుకో, లేదా నేనే నీవేలుపట్టుకుంటాను. నీపళ్ళు ఎంత అందంగా వున్నాయిరా! నువ్వు 'అమ్మా అమా'

అని ఎందుకంటావు? 'నాన్నా నాన్నా' అని ఎందుకనవు? ఆయన లేక ఈ ఇల్లు బోసిపోతుందికదా!'' అంటూ కుమారుని యెడల తన ముద్దూ మురిపం ప్రదర్శిస్తుంది.

తాను చిక్కిపోతున్నా కుమారుడు క్రమంగా పెరుగుతున్నందుకు యశోధర సంతోషిస్తుంది. రాహులుడు తన ప్రతిబింబాన్ని చూచి భయపడ్డప్పుడు తల్లి నచ్చజెబుతుంది. "పాలుత్రాగుదువురా కుమారా!'' అని పిలిస్తే, చిక్కకుండా పరుగెత్తేవాడు రాహులుడు. ఆ పిల్లచేష్టలుచూచి ఆమె సంతోషిస్తుంది.

తల్లికొడుకులు దాగుడుమూతలాట ఆడేవాళ్ళు. తల్లి కుమారుణ్ణి పట్టుకోలేకపోతే, ''హార్ గయీ మాఁ హార్ గయీ!'' అంటూ రాగం తీసేవాడు. తల్లి సంతోషంగా తన అపజయం అంగీకరించేది. ''నాన్న ఎప్పుడొస్తాడు?'' అని అడగ్గా ''కుమారా! ధైర్యంగావుండు. మనము ఏదో ఒకనాడు ఆయన్ను తప్పకుండా కలుసుకుంటాం.'' అంటూ ఓదార్పుమాటలు చెప్పేది.

"అమ్మా! నాకేగనుక పక్షిలాగ రెక్కలుంటే, ఒక్క గంతులో పైకి ఎగిరిపోయేవాణ్ణి. ఆకాశంలో చుట్టూ తిరిగేవాణ్ణి. నాన్నగారు ఏ అడవిలో కూచొనివున్నారో చూసేవాణ్ణి. దగ్గరకు వెళ్ళి ''తాత్ ఉఠో, ఘర్ చలో'' అనేవాణ్ణి. అప్పుడాయన నన్ను చూసి ఆశ్చర్యపోయేవాడు. ''తూ కౌన్ హై?'' అని అడిగితే పేరు చెప్పేవాణ్ణి. దారి చూపించి వెంటనే ఇంటికి తోడుకవచ్చేవాణ్ణి.

నాన్నగారు నామాట తప్పకుండా వింటారు. కాని ఏంలాభం? రెక్కలులేకుండా ఈ ఆలోచనలన్నీ వ్యర్థమేగదా! అయ్యో! మానవులు పక్షులకంటే సిపోయినవాళ్ళుగదా? భూతలవాసులమైన మనము నీటిలో ఈదగలముగాని, పక్షులవలె ఎగరలేముగదా? అమ్మా! భగవంతుడు మనకు రెక్కలు ఎందుకివ్వలేదు?" అంటూ తల్లిని ప్రశ్నించేవాడు రాహులుడు.

ఈలాంటి మార్మికమైన ప్రశ్నలకు తల్లి చమత్కారంగా జవాబు చెబుతూవుండేది. అప్పుడప్పుడు కథలుచెప్పమని మారాము చేసేవాడు. తల్లి బుద్ధుని వితానికి సంబంధించిన కథలను వినిపించేది. కథవింటూ కన్నుమూసేవాడు రాహులుడు. అప్పుడు యశోధర జోలపాటపాడేది.

సో, అపనే చంచలపన్ సో!
సో, మేరే అంచలధన్ సో!
పుష్కరసోతాహై నిజసర్ మేఁ!
భ్రమర సోరహాహై పుష్కరమేఁ!
గుంజన్ సోయా కభీ భ్రమరమేఁ!
సో, మేరే గృహ గుంజన్ సో!
సో, మేరే అంచలధన్ సో!

"కమలం చెరువులో నిద్రపోవడం, భ్రమరం కమలంలో నిద్రపోవడం, భ్రమరంలో శబ్దం నిద్రపోవడం" ఎంతో అర్థపూర్ణంగా భావయుక్తంగా సంగీతాత్మకంగా వుంది.

తదుపరిసర్గ మళ్ళీ 'యశోధర' శీర్షికన వ్రాయబడింది. ఈ సర్గ విరహిణి యశోధరయొక్క పీడామయ కథగా వుంటుంది:

అంధకార రూపమైన పరదా చాటున ఏదృశ్యం రూపు దాలుస్తున్నదో గదా! నాఅదృష్టం నక్షత్రాలరూపంలో విత్తనం నాటుతూ వుంది. గడ్డిపరకలపై పడివున్న మంచుబిందువులు, సృష్టి రోదించగా కారిన కన్నీటిబిందువులుగా కనిపిస్తున్నాయి యశోధరకు. తెల్లవారిపోయినా, సిద్ధార్థుడు వెంట నందున ఆ ప్రభాతంకూడా రాత్రిమాదిరే కనుపిస్తున్నది. సంయోగకాలంనాటి స్మృతులు నెమరువేసుకొంటూ దుఃఖిస్తుంది. తాను ఏడుస్తూవున్నా, తన ఏడుపు భర్తమార్గానికి విఘ్నంకాకుండా వుండాలని కోరుతూవుంటుంది.

తదుపరిసర్గ మళ్ళ "రాహుల్ జననీ" పేరుతో వ్రాయబడింది. ఈసర్గలో మళ్ళ యశోధర మాతృస్వరూపం వర్ణించబడింది. సూర్యోదయంఅవుతుంది. యశోధర కుమారునిలేపుతూ "కుమారా! నాయనా, రాజా, నిన్నుచూస్తూవుంటే, నాబాల్యం జ్ఞాపకం వస్తూవుందిరా, లే, నువ్వు త్వరగాలేచి కూర్చో!" అంటూ లేపుతుంది.

రాహుల్ లేచి కూర్చొని, తాను నిద్రలోచూచిన స్వప్న వృత్తాంతాన్ని ఇలా వినిపిస్తాడు. "అమ్మా! నాకు కలలో తండ్రిగారు కనిపించారు. ఆయన ఒక మేకపిల్లను ఒళ్లోపెట్టుకొని దానికి గడ్డి తినిపిస్తున్నారు. దానితల్లి తలవొంచి తండ్రిగారి కాళ్లనాకుతూ వుంది. ఎన్నో పశువులు, పక్షులు, ఆయనవద్ద చేరివున్నాయి. నన్ను

కూడా ఎత్తుకోమని నేనడిగాను. ఆయన నామాటలువిని 'ఏం? నీతల్లి నిన్ను ఎత్తుకోలేకపోయిందా?' అన్నారు. ఇంతలో తెల్లవారిపోయింది. నాకళ్లు తెరుచుకొన్నాయి. నాకు ఈప్రకృతి అంతా నీమాది స్వచ్ఛంగా కన్నీరుకారుస్తూవున్నట్లు అనిపిస్తున్నదమ్మా!'

యశోధర విరహానికీ వినోదానికీ రాహుల్‌తప్ప వేరే ఆధారంలేదు. కనుక ఆమె తనను రాణిగా మర్చిపోయి రాహుల్‌ను లాలించి పోషించడమే కర్తవ్యంగా పెట్టుకుంది.

ఒక సకియ యశోధరతో ఇలా అంటుంది. "రాముడిచేత సీత పరిత జింపబడినమాట వాస్తవమే అయితే, ఆమె వా ల్మీకి ఆశ్రమంలో భర్తకు దూరంగావుండి ఆయన్నే స్మరిస్తూ నీమాదిరే లవకుశులను పెంచుతూ జీవితం గడుపుతూవుండేది." అనగానే యశోధర అందుకొని, "సీత భర్తృవియోగాన్నే కాకుండా లోకాపవాదాన్నికూడా సహించవలసివచ్చింది. నేను బహుశః అంత కష్టాన్ని సహించజాలను" అంటుంది.

అంతలో మరోసఖి గంగ అందుకొని "శ్రీకృష్ణుని వియోగంలో గోపికలుకూడా చాలాచాలా సహించాల్సి వచ్చింది." అనగానే యశోధర అందుకొంది.

"వాళ్ళు ఆయన దర్శనంకోసం రాత్రింబగళ్లు తపించిపోయారు. అయినా వాళ్ళకు తమ ప్రియతముడి దర్శనంకాలేదు.

కాని నావిషయంవేరు. నాభర్త నాకు ఏదోఒకనాడు దర్శనమిస్తాడని నాకు నమ్మకముంది." అనగానే మల్లగంగ అందుకొంది.

"దేవీ, నిన్నుచూస్తూవుంటే నాకు దుష్యంతునిచేత తిరస్కృతయైన శకుంతల జ్ఞప్తికివస్తుంది. రాహులుడుకూడా శకుంతలా పుత్రుడైన భరతునివలె వృద్ధిలోకి రావాలని నాకోరిక."

అంతలో మల్ల యశోధర అందుకొంది. "భర్తల ద్వారా తిరస్కృతలైన నా పూర్వులుకూడా గొప్ప గొప్ప దుఃఖాలు అనుభవించారు. ఈపూర్వుల కష్టాలను జ్ఞప్తికితెచ్చుకొని నాకష్టాలన్నిటిని సహిస్తాను."

ఇంతలో మరొకసఖి గౌతమి అందుకొంది. "పురుషులు ఎల్లప్పుడు స్త్రీలపట్ల నిర్దయులుగానే వున్నారు. ఈ నిర్దయులైన పురుషులచేతుల్లో దుర్బలులైన స్త్రీలు ఎన్నెన్నికష్టాలు అనుభవించవలసివచ్చింది!"

అందుపై యశోధర ఇలా వ్యాఖ్యానించింది. "నువ్వు వాళ్లను నిర్దయులని ఎందుకంటావు? ఎందువల్లనంటే, నాభర్త క్రిమికీటకాల దుఃఖాన్నికూడాసహించలేడు." అనగానే గౌతమి వ్యంగ్యంగా, "అందుకనే నీభర్త నీకు ఇంత సుఖాన్నిచ్చి వెళ్లాడు!" అంది.

అందుమీదట యశోధర అందుకొంది. "నిజంగా ఆయన తన దుఃఖంలో భాగస్వాములుగాచేసి, మనలను నిజమైన ఆశ్రయు

లుగా రుజువుచేశాడు. మనందరి సుఖంకొరక అన్వేషణ చేయడా నికి ఆయన వెళ్లాడు.''

యశోధరజవాబు గౌతమికినచ్చలేదు. ''దేవీ నువ్వు ఏమైనా అను, ఆయనమాత్రం బంగారంలాంటి బ్రతుకు కాలదన్ని అడవు లెంటపడ్డాడు. ఆయనకు జననీ జన్మభూమిపట్లకూడా మమకారం వున్నట్లులేదు.'' అంటుంది గౌతమి.

తన భర్తపైన ఆరోపించబడిన ఈ కళంకాన్ని కడిగివేస్తూ యశోధర ఇలా అంటుంది. ''స ! పురుషులుపుట్టేది కేవలం తల్లి వాళ్ళో కూచోడానికికాదు, పురుష కాదు, స్త్రీలుకూడా తల్లివాళ్లోనే కూర్చొనివుండరు. ఎందువల్లనంటే, వాళ్ళు తమ భర్తలయిళ్ళకు పోవలసివుంటుంది. ఇదేకాదు మొత్తం విశ్వాన్నే తమ కుటుం బంగా భావించినవాళ్ళకు మాతృభూమిఅనేది ఏమీ బంధనంకాదు.'' ఇలాంటి తార్కికమైన సంభాషణతో ఈసర్గ ముగుస్తుంది.

తదుపరిసర్గ మ ళ 'యశోధర' పేరున వ్రాయబడింది. సిద్ధార్థుడు మోక్ష ప్రాప్తికొరకు వెళ్ళినా, యశోధరకు మోక్షంపైన ఆసక్తిలేదు. ఆమెకు వన మరణాలలో తేడాకనిపించడంలేదు. ఒకవేళ ఏమైనా తేడా అంటూవుంటే, జీవితానికంటే మృత్యువే ఇష్టంగా కనుపిస్తుంది. మోక్షాన్ని లేక నిర్వాణాన్ని ఆమె హేయంగా చూస్తుంది. ఆమె దృష్టిలో ప్రపంచంలోని సుఖాలన్నీ అనుభవించవలసినవే! దుఃఖం కపోతే సుఖానికి విలువేలేదు. ఆమె

తన భర్తయొక్క కైవల్యకామననుకూడా ఒక కామముగానే భావిస్తుంది. అటువంటి పరిస్థితిలో ప్రపంచంలోని -వుల మేలుకోరి ప్రపంచంలో -వించాలి. ఈ ప్రపంచంపైన విరక్తి కలుగజేసుకొని మోక్షంకోరడం భావ్యంకాదు వించి వున్నంతకాలం భర్త వెంట వుండాలనీ, మరణిస్తే తనభర్త ఒడిలో మరణించాలనీ కోరుతుంది యశోధర.

అటుపైన సర్గ 'రాహుల్‌జననీ' శీర్షికన వ్రాయబడింది. ఈ సర్గలో మళ్ళ యశోధర మాతృస్వరూపం చిత్రించబడింది.

ఒకమారు యశోధర నదిలో దీపార్చనచేస్తూ దానితో "నువ్వు నాభర్తను వెదకాలి, ఆయన కనుపించగానే, 'నీ కొమారుని తల్లి యశోధర వలం నిన్నే ధ్యానిస్తూకూర్చుంది'. అని చెప్పాలి." అంటుంది.

రాహులుడు మోక్షస్వరూపాన్ని తెలుసుకోవాలని కోరితే యశోధర అంటుందిగదా! "కుమారా! ఈవిషయం మీ తండ్రి గారినేఅడుగు." వెంటనే రాహులుడు అందుకొని అయితే నాకు గుర్రం సిద్ధంచేయించు, నేను ఇప్పుడేవెళ్లి తండ్రిగారిని అడుగుతాను, మోక్షంగొప్పదో, మాతల్లిగొప్పదో! నువ్వు ఏడ్వవద్దు. నేను వెళ్లి తండ్రిగారిని తొడుకవస్తాను." అంటాడు.

పుత్రుడు వెళ్లిపోతాననడంతో తల్లి గాబరాపడిపోతుంది. "నాయనా, నీవు ఎక్కడికి వెళ్లవద్దు. నాభుజాలపైనఎక్కు. నేను

మీతండ్రిమాదిరి నిన్నుకూడా పోగొట్టుకుంటానేమో!'' అంటూ యశోధర భయపడిపోతుంది. మరోసారి రాహులుడు తల్లిని ఇలా ప్రశ్నిస్తాడు. '' అమ్మా! భక్తుడు భగవంతుణ్ణి ఆరాధించినట్లుగా నువ్వు మాతండ్రిగారిని ఎందుకు స్మరిస్తూవుంటావు. భక్తుడి మొర విని ఆభగవంతుడుకూడా దిగివస్తాడుగాని మాతండ్రి గారు నీవైపు తొంగిచూడ్డంకూడాలేదు. అమ్మా! నీపరిస్థితి చాలావిచిత్రంగా వుంది. నాకోసం పాడుతున్నావు, మాతండ్రిగారికోసం ఏడుస్తు న్నావు. మాఇద్దరిమధ్య నీపరిస్థితి పిచ్చిదానిమాదిరి తయారైంది.'' కుమారుని ఈ మాటలకు యశోధర జవాబుచెబుతూ :-

'' కుమారా 'రోనా ఔర్ గానా,' ఏడ్వడం, పాడడం ఈ రెండూ నా వితానికి రెండు అంగాలు. ఈరెంటి రసాన్ని నేను ఒ మారు ఆస్వాదిస్తాను.'' అంటుంది.

తదుపరిసర్గ 'సంధాన్' పేరుతో వ్రాయబడింది. మహాత్మా, గౌతమబుద్ధుని జాడతెలిసినట్లుగా ఈసర్గ ప్రారంభాన పేర్కొన బడింది. సఖి గౌతమి యశోధరకు ఈవార్త అందించింది. సిద్ధులన్నీ ఆయనకు చరణదాసీలయ్యాయనీ, ఆయన శుద్ధ బుద్ధ భగవాను డయ్యాడనీ, చెప్పింది. ఆనందాతిశయమున యశోధరకళ్ళు అశ్రు ధారలు వర్షిస్తాయి. అంతలో శుద్ధోధనుడు, మహాప్రజావతి యశోధర మందిరానికివస్తారు. సావిత్రిపుణ్యాన సత్యవంతు ప్రాణాలు దక్కినట్లు నీపుణ్యాన్నే సిద్ధార్థుడికి సిద్ధి లభించిందంటాడు శుద్ధోధనుడు. నీభయంకర వైరాగ్యము ధన్యమైందని అంటుంది

మహాప్రజావతి. పార్వ పరమేశ్వరులవలె యశోధర సిద్ధార్థుల పేర్లుకూడా ఈ ప్రపంచంలో శాశ్వతంగా వుండిపోవాలంటాడు శుద్ధోధనుడు.

సమీపంలోని మగధలో బుద్ధుడు వచ్చివున్నాడనిన్నీ, మనందరంవెళ్లి తొడుకవస్తామనిన్నీ శుద్ధోదనుడు యశోధరతో అంటాడు. నాభర్త అనుమతిలేనిదే నేను గడపదాటి రానంటుంది యశోధర. అత్తమామలు నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తారు. కాని స్వా మానవతి యశోధర వారితో ఇలా తర్కిస్తుంది.

" అమ్మా! ఆయన నన్ను స్వయంగా వదలివెళ్లాడు. కనుక ఆయనకు ఇష్టమైతే తానుగావచ్చి తన చరణాలవద్ద నాకు స్థానమిస్తాడు. ఆయనవద్దకు వెళ్లడానికి నాకు ఏలాటిబాధాలేదు, ఇబ్బందీ లేదు. నాభర్తవద్దకు వెళ్లదలిస్తే నన్ను ఈ ప్రపంచంలో ఏశక్తి ఆటంకపరచజాలదు. నేను వెళ్లాలనే అనుకొనివుంటే ప్రపంచమంతా గాలించి ఆయన ఎక్కడవున్నా వెళ్లి ఆయనచెంతచేరి ఆయన్ను ఇక్కడకు తొడుకవచ్చేదాన్ని. ఇవాళ సుధాసాగరము నా ఎదుటనిలచివున్ననూ నేను ఒడ్డుననిలబడి దప్పికతోనే తపిస్తున్నాను. నావంటి దురదృష్టవతులు ప్రపంచంలో మరెవరుంటారు" అంటూ యశోధర మూర్ఛపడిపోతుంది.

తదుపరిసర్గ 'యశోధర' పేరున వ్రాయబడింది. ఈసర్గలో యశోధర కరుణాపూర్ణ స్వరూపం చిత్రించబడింది. ఆమె బుద్ధుని

వుద్దేశించి 'నాథా, నీవు ప్రపంచానికి ముక్తిమార్గంచూపినా, నాకు మాత్రం ఈ ప్రపంచమే ఇష్టము. నేను ఈ ప్రపంచాన్నే అందమైనదంటాను. ఎందువల్లనంటే, ఈ ప్రపంచమే లేకపోతే, నీలాంటి మహాత్ముడు ఎలా పుడతాడు? ప్రియతమా! నీవు ఇక్కడకువస్తే నేను నీకు తగినకానుక ఏమి అర్పించగలను? ఈ నశ్వరమైన శరీరాన్నే అర్పించమంటావా? కాదుకాదు; నేను నీచరణకమలాలధూళి తప్పకుండా శిరస్సున దాలుస్తాను'' అంటుంది.

"కపిలవస్తునగరంనుండి బుద్ధునిజాడ కనుగొనుటకు ఎవరు వెళ్ళినా, వాళ్ళు భగవంతుని ఉపదేశామృతాన్ని పానంచేసి అక్కడే వుండిపోతున్నారు. ఎవరూ తిరిగి రావడంలేదు. ఈవిధంగా నావాళ్ళంతా పరాయివాళ్ళయిపోతున్నారు. అయినా నేను ఇంకా మిగిలేవున్నాను. ఒకవేపున నాస్వామి అమృతాన్ని గ్రోలుచున్నా మరోవేపు నేను కన్నీటినే గుటకలువేస్తున్నాను. నాథా! నన్ను కలుసుకోడానికి ఇంకా సమయంరాలేదా? ఇక్కడకువస్తే నీయోగానికి భంగం వాటిల్లేటట్లయితే, ఆయోగము మరిదేనికి?'' అంటూ చివరకు బుద్ధభగవానుని కరుణ కలగాలని ప్రార్థిస్తుంది.

తదుపరిసర్గ 'రాహుల్‌జననీ' శీర్షికన వ్రాయబడింది. ఈ సర్గలో యశోధరా రాహులులమధ్య సంభాషణ జరుగుతుంది.

యశోధర బుద్ధుణ్ణి వుద్దేశించి "స్వామీ! మీరు ప్రపంచానికి మార్గదర్శకులైనా, మీయింటిదారిమాత్రం మర్చిపోకూడదు. మీకు

గాకుండా ఇతరులకుమాత్రమే ఉపయోగపడే ఆ జ్ఞానజ్యోతివలన ఏంలాభం?" అంటూవుండగా రాహులు అక్కడకువచ్చి "అమ్మా! ఇవాళకూడా నాన్నగారికొరకు ఎదురుచూడ్డంలోనే గడచిపోయింది. కాని ఆయనజాడ ఏమీ తెలియలేదు. ఇలా ఎన్నాళ్లుగడచిపోతాయో! పగలంతా ఎదురు చూసిచూసి ఇప్పుడు సంధ్యాకాలమై పోయింది. ఆకాశంలో నక్షత్రాలను చూస్తూవుంటే, నీకన్నీటిబిందువులే వ్యాపించివున్నట్లనిపిస్తున్నది" అంటాడు.

యశోధర అందుకొని "కుమారా! నీలాంటి చంద్రుడు నా ఒళ్లోవున్నాడు. నేను సంతోషంగా కాలంగడపగలను." అంటూ తృప్తిపడుతుంది.

ఈవిధంగా తల్లిబిడ్డలమధ్య సంభాషణ జరుగుచూవుండగా బుద్ధుడు వచ్చేస్తున్నాడన్నవార్త వినిపిస్తుంది.

తదుపరిసర్గ 'యశోధర' శీర్షికన వ్రాయబడింది. పునస్సమాగమానికి కొన్నిక్షణాల పూర్వము యశోధర ఆలోచనలు ఇందులో వర్ణించబడ్డాయి. ఆమె తనమనస్సుతో ఇలా అంటుంది:-

'ఓ మనస్సా! ఇవాళ నీ పరీక్షాసమయం వచ్చింది. నీవు నా గౌరవం కాపాడాలని కోరుతున్నాను. భావవిగళితనై నేను నావ్యక్తిత్వాన్ని పోగొట్టుకోకుండా వుండాలి. ఇంతవరకు ఆర్యపుత్రుడు దూరంగావున్నాడు. కనుక నన్ను నేను స్వాధీనంలో వుంచుకోవ

డంలో విశేషమేమీ_దు. ఇక ఇప్పుడు ఆర్యపుత్రునికి స్వాగతం పలకడానికి మంగళవాయిద్యాలు మ్రోగుతున్నాయి. ఈలాంటి ప్పుడు తన్నుతాను వశంలో వుంచుకోవడమే నిజమైనపరీక్ష. ఇప్పుడు నా వనధనం కొద్దిదూరంలోనేవుంది. కాని నాదారి అంధ కారమయమై నాకు కనిపించడంలేదు. వారు ఇంతదూరం తిరిగి రాగాలేంది, ఇంకో రెండడుగులు నడచి నావద్దకురావడానికి కష్ట మేమిటి? ఈ రెండడుగులదూరము నాకెంతభారమైనదో తనకూ అంతేనా? ఆయనే నాకు వెన్నుచూపించాడుగదా, కాబట్టి ఆయనే నాఎదుటకురావాలి. నేను ఆయనవద్దకు వెళ్ళను. నగరవాసు లంతా వారిని దర్శించుకొని, వారిని స్పర్శించి, లాభంపొంది తమను అదృష్టవంతులుగా చేసుకోనిమ్ము. కాని నేనుమాత్రం ఆయన వద్దకువెళ్ళను. ఆడుద్ధారకుడు రావాలంటే, రానిమ్ము, ఆయన దాసి ఇక్కడే వుంటుంది.''

ఈ విధంగా అ మానం ప్రదర్శించిన తదుపరి మ్లా ఈ విధంగా ఆలోచిస్తుంది.

"కపిలవస్తునగర రాజకుమారుడు భిక్షుకుడై తిరిగివచ్చాడు. ఇదేనా చివరకు మిగిలింది! రాజభోగాల్లో తృప్తిలేక తనవంశాన్నీ సమాజాన్నీ వదలిపెట్టి ఇంటింటా చేయిచాస్తున్నాడు!''

ఇంతలో యశోధరసఖివచ్చి వార్త అందించింది.

"బుద్ధభగవానుడు మనగడపలో వచ్చివున్నాడు. నీవు ఇంకా లోపలే కూర్చొనివున్నావా? ఆయన్ను చూస్తూవుంటే, స్వయంగా మోక్షమే రూపందాల్చి వచ్చిందా అన్నట్లువున్నది.''

ఇందుమీదట యశోధర "స , నావంటి దురదృష్టవంతు రాలికి వారివద్ద స్థానమేలేదు. యశోధర ఇక్కడే వుంటుంది. ఎక్కడైతే ఆయన వదలి వెళ్ళాడో అక్కడే వుంటుంది" అన్నది.

చివరిసర్గ 'బుద్ధదేవ్' శీర్షికన వ్రాయబడింది. గౌతమ బుద్ధుడు యశోధరయొక్క అతాభిమానాన్ని తొలగించసంకల్పించి-

మానినీ, మాఁతజో లో రహీతుమ్‌హారీబాఁ,
దానినీ, ఆయాస్వయం ద్వార్‌పర్ యహ్ తవ తత్రభవాన్

"అ మానవ , నీస్వామినైననేను ఇప్పుడు స్వయంగా, నీ గుమ ంవద్దకువచ్చాను. కనుక ఇక నీవు నీపట్టుదల వదలిపెట్టు."

గౌతముని ఈవచనాలు వింటూనే యశోధర పట్టుదల సడలిపోయింది. ఆమె ఆయనకు స్వాగతంచెబుతూ -

పథారో భవభవకే భగవాఁ
రఖ్ మేరీలజ్జాతుమ్‌నే
ఆవో అత్రభవాన్.

"స్వామీ, దయచేయండి. మీరు నాగౌరవం కాపాడారు. లోనికిరండి. స్వామీ, నావంటి తుచ్ఛమైన వ్యక్తికి మీరు ఎంతో గౌరవం ఇచ్చారు. ఇదే మీకు గొప్పవిజయం.

నేను ఎప్పటినుండో మీకొరకు నిరీక్షిస్తున్నాను. చివరకు మీరు రానేవచ్చారు. మీరాకతో నాజ్ఞానద్వారాలు తెరచుకొన్నాయి. ఇప్పుడు నేను మీకు ఏమిచ్చేది? ఇవాళ నాకలలుపండాయి. నేను మిమ్మలను ఎన్నో ఎత్తిపొడుపుమాటలు అడగాలనుకున్నాను. అవన్నీ ఇప్పుడు నావద్దనుండి పలాయనం చిత్తగించాయి మీరు ఎదురుగావుండడంతో అన్నీ మర్చిపోయాను.'' అని విన్నవించుకొంది యశోధర.

అంతట బుద్ధుడు తన సందేశాన్ని వినిపిస్తూ, ''సాధ్వీమణీ, నీవు దీనురాలివికావలసిన అవసంలేదు. ఎందువల్లనంటే, స్త్రీ ఎన్నడూ తుచ్ఛమైనదికాదు. ఆమె మనస్సులో ఎల్లప్పుడూ ప్రాణులయెడల దయాభావన వుంటుంది అడవిలో ఆకలితో నాశరీరం శుష్కించిపోయినప్పుడు నీవంటి స్త్రీ పాయసంఇచ్చి ప్రాణాలు నిలబెట్టింది. నీకర్తవ్యాన్ని గురించి ఇంతకంటే ఎక్కువ చెప్పవలసిందేమీలేదు. నీవు ఇంతవరకు ఆచరించినదే స్త్రీధర్మము.'' అన్నాడు.

బుద్ధభగవానుని అమృతవాక్కులువిన్న యశోధర కృతకృత్యురాలైనట్లు భావించింది. రాహులుణ్ణి ముందుకుపిలచి అతనితో తండ్రివద్ద ఉపదేశంపొందమని చెబుతుంది.

తండ్రి కుమారుణ్ణి బుద్ధ, ధర్మ, సంఘ ఆశ్రయాన్ని స్వీకరించమని చెబుతాడు. తండ్రి ఆదేశం ప్రకారం రాహులుడు -

యశోధర

బుద్ధం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి.

అంటాడు.



"స్వామీ!" చివరలో యశోధర అంటుంది. "మీరు నా గుమ్మంముందు క్షకు వచ్చారు. నావద్ద క్షగా ఇవ్వతగిన వస్తువు రాహులు తప్ప మరేమీలేదు. నేను అతణ్ణే క్షగా ఇస్తున్నాను. ఇతడు ఎప్పుడూ మిమ్ములను అనుసరించుగాక. నా దుఃఖంలోనే విశ్వసుఖం నమైవుండగా నేనుమాత్రం "బుద్ధం శరణంగచ్ఛామి" ఎందుకు స్వీకరించనూ?" అంటూవుండగా కావ్యం సమాప్త మవుతుంది.



---

# ఊర్వశి

(భారతీయ జ్ఞానపీఠ బహుమతి గ్రంథము)

72 వ సంవత్సరానికి సంబంధించిన భారతీయ జ్ఞానపీఠ బహుమతి ప్రముఖ హిందీకవి శ్రీరామ్‌ధారీసింహ్ 'దినకర్'కు ఆయన వ్రాసిన పద్యకావ్యం 'ఊర్వశి'కి గాను యివ్వబడింది. ఈ బహుమతి క్రింద వారికి లక్షరూపాయల నగదు, తామ్ర ప్రశంసా పత్రం, వాగ్దేవి కంచువిగ్రహం ఇవ్వబడ్డాయి. 96 నుండి 965 వరకు 5 భారతీయ భాషలలో ఉత్తమమైన రచనగా 'ఊర్వశి'కి ఈ బహుమతి ఇవ్వబడింది.

శ్రీరామ్‌ధారీసింహ్ 'దినకర్' హారు ప్రాంతంలోని ముంగరజిల్లా సిమరియా గ్రామంలో 90 వ సంవత్సరంలో జన్మించారు వీరు కొంతకాలం ప్రభుత్వ ఉద్యోగాలు చేశారు. కొంతకాలంవరకు ప్రొఫెసర్‌గా పనిచేశారు. కొంతకాలము పార్లమెంటు సభ్యులుగా వున్నారు. కొంతకాలం భాగల్‌పూర్ విశ్వవిదాలయం వైస్‌ఛాన్సలర్‌గాకూడా పనిచేశారు. తదుపరి కొంతకాలం కేంద్రప్రభుత్వ 'హిందీసలాహకార్‌సమితి' అధ్యక్షులుగా పనిచేశారు.

దినకర్‌గారి భావనాశక్తి కడుగంభీరము, విస్తారము సంతరించుకొన్నది. జాతీయకవుల పరంపరలో గొప్ప సమర్థుడని

పేరుగాంచారు. వీరి కవిత్వంలో తరుణవయస్కుల హృదయాలను ఝంకృతపరచే విలక్షణ శక్తిగలదు. ప్రారంభంనుండికూడా భారత దేశ దీనస్థితినిచూసి తన కవిత్వంద్వారా కన్నీరు కార్చేవారు.

వీరి ప్రబంధకావ్యాలలో కురుక్షేత్ర, రశ్మిరథి, ఊర్వశి ముఖ్యమైనవి. వీరి ఖండకావ్యాలలో రేణుకా, హుంకార్, రసవంతి, బాపూ, పరశురామ్ ప్రతిజ్ఞా పేరుగాంచినవి. గద్యకృతులలో మిట్టీ ఓర్, కావ్య భూమికా, రే కేపూల్, సంస్కృతి చార్ అధ్యాయ్ వంటివి ప్రసిద్ధములు.

వీరి రచనలన్నిటియందు జాతీయగౌరవాన్ని పెంపొందింప చేయడమే ప్రధానాంశముగ కాననగును. అందువలననే వీరి సాహిత్యములో ప్రగతివాదలక్షణాలు ప్రధానంగా కనుపిస్తున్నాయి. ఈలాంటి సాహిత్య మహత్తువల్లనే వీరు 'భారత జాతీయకవి'గా పేరుపొందారు. కావుననే హిందీసాహిత్య జగత్తునందు వీరు నిజమైన దినకర్‌గా ప్రకాసిస్తున్నారు.



# మహాకావ్యం "ఊర్వశి"

ఊర్వశి దేవలోకపు ఒక అప్సర అనిమాత్రమే భారతీయ సాధారణ ప్రజానీకంలో ప్రతీతి. ఆది గ్రంథరాజములైన వేదాలు మొదలు ఉపనిషత్తులు, పురాణాలు, ప్రబంధకావ్యాలవరకు ఆమె ముఖ్యస్థానాన్ని ఆక్రమించుకొన్నది. పండితులు ఊర్వశి పదానికి ప్రబల లాష, అపరిమితకాముకత మొదలగు అర్థాలుచెప్పారు. కవీంద్రులైన రవీంద్రనాథఠాకూర్ గారు తన 'చిత్రా' అనే కావ్య సంగ్రహంలో ఊర్వశిపైన ఒక మంచి కవిత వ్రాశారు. శ్రీ అరవిందులుకూడ ఒకఖండకావ్యమువ్రాశారు బహుశా కాళిదాసుని విక్రమోర్వశీయము తదుపరి భారతీయ సాహిత్యంలో ఖ్యాతిపొందినరచన శ్రీ రవీంద్రనాథ్ఠాకూర్ గారిదే కావచ్చు.

దినకర్ గారి ఊర్వశి మహాకావ్యపు సమస్తలక్షణాలతో శోభాయమానంగావుంది. కవి దీనిని నాటకమువలె ఐదు అంకాలుగా విభజించాడు. సంవాదాలూ, సంభాషణలుకూడ అభినయానికి అనుకూలంగా వుంచాడు. ఈవిధంగా కవి పాఠకులయెదుట ఒక చిక్కుసమస్య తెచ్చిపెట్టాడు. 'ఊర్వశి'ని కావ్యమనవలెనా లేక నాటకమనవలెనా? కాని రసమర్మజ్ఞులు దీనిని కావ్యమనే అన్నారు. ఐనా దినకర్ గారి 'ఊర్వశి' నాటకీయకావ్యమనియే కొందరి అభిప్రాయం. ఇందలి పాత్రలు తమ భావపరంపరను సరస స్వరంతో

వ్యక్తకరించారు. సనాతన పురుషుడు, ప్రకృతియొక్క రహస్యమైన శక్తియే ఈకావ్యానికి ఆధారం. ఇది హైందవ సాహిత్య సంస్కృతులకు ఆనుషంగికమైన ప్రవృత్తి.

నాటకీయ శృంగార కావ్యమైన 'ఊర్వశి'లో ఐదు అంకాలున్నాయి. ప్రథమాంకంలో ఊర్వశి స్వర్గలోకంనుండి మర్త్యలోకానికి దిగివచ్చినట్టిచర్య తన సఖులద్వారా వెల్లడవుతుంది. ద్వితీయాంకంలో పురూరవ మహారాజు ఊర్వశి సాంగత్యంతో గంధమాదన పర్వతంపై విహరిస్తున్న విషయాన్ని మహారాణి ఔశీనరీ దేవికి మహామంత్రి నివేదిస్తాడు. వేశ్యాకాముకుడైన తనభర్త ఆచరణను తలచుకొని రాణి అత్యంత వ్యాకులత చెందుతుంది. సఖులు ఆమెను ఓదార్చుటలో నమైపోతారు. తృతీయాంకము పూర్తిగా ఊర్వ పురూరవుల సంభాషణలతో నిండివుంటుంది. ఇందులో కవి జగత్తు రహస్యాన్ని విశదీకరించడంలో నిమగ్నమవుతాడు. ఇందులోనే కవియొక్క ఉదీయమాన భావుకత చరమస్థాయి నందుకుంటుంది. నూటయెనభై ఆరు పేజీల పుస్తకంలో ఈ తృతీయాంకము అరవై పేజీల నాక్రమించింది. ఈ అంకమే ఈ మహాకావ్యానికి వెన్నెముక వంటిది. కవి ఇందులో తన సమస్త అస్థిత్వాన్ని క్రుమరించివేశాడు. అందంగా, ఉత్తమంగా మర్మమధురంగా తాను చెప్పదలచినదంతా తన హృదయమస్తిష్కాలను పిండి ఇదే అంకంలో పొందుపరచాడు. ఊర్వ పురూరవుల పరిపూర్ణ సంగమము ఈ అంకములోనే జరిగింది. శృంగార రసము

ఇంతవరకు ప్రవహించి అగాధమైన అలలతోకూడిన సాగరమే అయిపోతుంది. పాఠకుడు సహజంగానే శృంగార భావనలో నమైపోతాడు.

ఊర్వశి పురూరవుని గాఢాలింగనములో నమై ఇలాఅంటుంది.

"రసమయీ మేఘమాలా బనకర్ మైఁ తుఝేఘేర్ ఛాజాఊంగీ
పూలోం ఛాఁహతలే అపనే అధరోంకీ సుధా పిలాఊంగీ;"

(రసమయమైన మేఘమాలనై నిన్నుకప్పివేసి పూలనీడల క్రింద నా అధరామృతాన్ని త్రాగిస్తాను.)

"కసేరహో, బస్, ఇసీభాంతి, ఉరపీడక ఆలింగన మేఁ,
ఔర్ జపాతేరహో అధరపుట కో కఠోర చుంబన్ సే."

(హృదయానికి మధురబాధను కలిగించే ఆలింగనములో, ఆఁ, ఇలాగే అంటిపెట్టుకొనివుండు. నాఅధర పుటములపై కఠోర చుంబనాలందిస్తూ నన్ను జపిస్తూవుండు.)

ఈలాంటి కామసుఖమే ముక్తిమార్గమని రుజువుచేస్తుంది ఊర్వశి.

చతుర్థాంకములో చ్యవనఋషిపత్ని సుకన్య, పుత్రవతి యైన ఊర్వశి గారల హృదయ సౌందర్యము దరనీయము. పంచ మాంకములో పురూరవుని పుత్రుడు 'ఆయు' ఆగమనము, అతని

పట్టా షేకము, రాజు వనములకేగుటవలన కలుగు పరిస్థితులవర్ణన హృదయాన్ని కంపింపజేస్తాయి.

ఈలాంటి ఇతి వృత్తాన్ని చేబట్టి కవి తన కల్పనద్వారా ఒక భవ్యరూపాన్ని సృష్టించి హృదయోల్లాసము చేకూర్చాడు. ఈ కల్పనాచాతురివలన పాత్రల విశిష్టత స్పష్టమవుతూ .. కథాగమనంలో స్ఫూర్తికానవస్తుంది. ఈ కావ్యంలో దేవత్వపరాజయపు మార్మికచిత్రణ లభ్యమవుతుంది. ఊర్వశి లౌకికసుఖానికి దాసురాలై స్వర్గమునుండి దిగివస్తుంది. కాని చివరలో అదృశ్యమై పోవడానికి కారణముచెప్పబడలేదు. భర్తనుగాని లేక పుత్రునిగాని ఒకరినే పొందగలవని ఊర్వశికి భరతముని శాపమున్నది. కాని ఈ దినకర్ కావ్యంలోని ఊర్వశి ఉభయులను వద్దని అదృశ్యమవుతుంది. బహుశః ఆమె దేవత్వము తిరిగి జాగృతమై యుండవచ్చు లేక మానవసంపర్కముపైన విరక్తి కలిగివుండచ్చు.

**కావ్యగత విశేషాలు:**

దినకర్ 'ఊర్వశి' శృంగార బహుళకావ్యము. హిందీ సాహిత్యపు శృంగారకాలపు కవులస్మృతులను జ్ఞప్తికితెస్తుంది. భోగలాలసత్వము, మరియు విలాస వాసనల ఆధిక్యతవలన పాఠకుల మనస్సును పూర్తిగా రమింపజేస్తుంది. పాఠకుడు శృంగారములోమునిగి బయటకు తొంగిచూడనొల్లడు. ఈ కావ్యంపైన అచ్చటచ్చట ఠాకూరు, జయశంకర్ ప్రసాద్‌ల ఛాయలు కాననగును:

కాని జయశంకర్ ప్రసాద్ మహాకావ్యం 'కామాయని'లోని శృంగారము ఇందుకు భిన్నమైనది. కామాయని శృంగారము ఎటువంటిదంటే, పాఠకుడు అందులో పూర్తిగా మునిగిపోయికూడా దానిని అంటకుండా వుంటాడు. కాని దినకర్ "ఊర్వశి" ఆలాంటి గ్యారంటీ ఇవ్వజాలదు. కాని విశుద్ధమైన కావ్యానందము దృష్టితో, నారీ మనస్తత్వపు సూక్ష్మ వివేచనం దృష్టితో చూస్తే ఇదిఒక బృహత్సృష్టి అనిపిస్తుంది. వ్యంజనాత్మకమైన సరళభాష, మనోవిజ్ఞానపు అంతుపట్టనిలోతుగల అక్షయభండారమని చెప్పవచ్చును.

(973 ఆగస్టు - సెప్టెంబరు 'ఆంధ్రప్రదేశ్' పత్రికయందు ప్రచురితము.)

---

# కురుక్షేత్రం

శ్రీరామ్‌ధారిసింహ్ 'దిన్‌కర్' హిందీలో వ్రాసిన 'కురుక్షేత్ర' కావ్యం సాహిత్యజగత్తులో సంచలనం రేకెత్తించింది. ఈకావ్య నిర్మాణం తరవాతనే ఈకవి మహాకవుల శ్రేణిలో ఒకరుగా పరిగణింపబడ్డాడు. ఈ కావ్యంలో భావము, రసము, ఛందస్సు, అలంకారాలు, శబ్దశక్తి బాగా వికాసంచెందాయి. కనుకనే స్థూలంగా ప్రబంధాత కత లోపించిననూ సాహిత్యరసికులు దీన్ని ప్రబంధ కావ్యంగానే అంగీకరించారు. వాస్తవంలో ఈ కావ్యంలో కథావస్తువు బహుతక్కువ. ఆదినుండి అంతమువరకు ఆయాపాత్రల అభిప్రాయాలే సూత్రకరింపబడ్డాయి.

ఈకావ్యంపేరు 'కురుక్షేత్ర'మయినా మహాభారతయుద్ధం ఎక్కడ సమాప్తిఅయిందో అక్కడినుండి ఈకావ్యం ప్రారంభమైంది. ఇది ఏడుసర్గల ప్రబంధం. ఇందులో ఆరవసర్గ స్వతంత్రమైనది. ఇది చాలా ముఖ్యమైనసర్గ. దీనికి కథాగమనంతో సంబంధంలేదు.

ఆధునిక జగత్తులో తలయెత్తే కొన్ని ప్రధాన సమస్యలను, వాటి నివారణోపాయాలను ధర రాజుమధ్య, భీష్ముడిమధ్య చర్చల ద్వారా పాఠకులదృష్టికి సుకరావడమే ఈకావ్యంలో కవియొక్క ఉద్దేశ్యంగా కనిపిస్తున్నది.

# ప్రథమ సర్గ

'మహాభారతం'నుండే భారతదేశచరిత్ర ప్రారంభమవుతుంది. ఆ చరిత్రపు అంతిమ అధ్యాయంలో విజయంపొందిన ఒక పురుషుడు విషణ్ణవదనంతో రోదిస్తూ కనపడతాడు. అతడి కన్నీరు కవికళ్ళల్లోకూడా పొంగి పొరలివస్తుంది. ఆకన్నీటి బిందువుల మెరుపులోనే మానవ - వితపు 'సత్యాన్ని' వెదకడానికి ప్రయత్నిస్తాడు కవి.

దూరంగా ద్వాపరయుగపు అంచున కూర్చొని కన్నీరుకారుస్తున్న యుధిష్ఠురుడిని ఈకవి వేలెత్తిచూపిస్తాడు. యుద్ధమందు అ లాషగల ఆనాయక వృద్ధునివెంట్రుకలుకూడా తెల్లబడిపోయాయి. కాని అతనిహృదయం కల్మషంగా కనిపిస్తుంది.

ప్రజాసముదాయం ఎప్పుడూ శాంతినే కోరుతూ వుంటుంది. కాని కొన్ని స్వార్థశక్తులు అశాంతిని భంగపరుస్తూవుంటాయి. అప్పుడే కయ్యానికి కాలుదువ్వడం జరుగుతుంది. ఆయుద్ధాగ్నిలో కొంతమంది సత్పురుషులుకూడా విధి - క దూకవలసివస్తుంది.

విజయంపొందిన సహృదయుడు తన దుష్కార్యాలకు ఏడుస్తాడు. "అరే, నేను ఇంతమంది నిర్దోషులైన మానవులరక్తం ఎందుకు ప్రవహింపచేశాను?" తతకుతానే సిగ్గుపడతాడు. ఇలాంటి భూమిక తదుపరి కవి అసలుకథను మొదలుపెట్టాడు.

# కురుక్షేత్రం

కురుక్షేత్రంలో నరమేధయజ్ఞం పూర్తిఅయింది. మానవ వక్షస్థలాన్ని చీల్చి నెత్తురుత్రాగి వజ్రసమానమైన తన మనస్సుకు శాంతిని చేకూర్చుకొన్న ముడు పాండవులందరిలో అతిబలశా . ఏనుగలాంటి అతడిశరీరం చూస్తూవుంటేనే అందరి భయంకలిగేది. చిన్నతనాన్నుండే కౌరవుల్లో కొంతమందిమీద ముడికి ప్రత్యేక మైన ద్వేషం పెరుగుతూవచ్చింది. ఆ ప్రేరణతోనే కురుక్షేత్ర యుద్ధంలో ఒకరితొడలు విరగ్గొడితే, మరొకడిభుజాలు వూడ గొట్టాడు. ఈ విజయోన్మాదంతో దిక్కులు పిక్కటిల్లజేశాడు.

ఈ సందర్భంలోనే కవి పాండవుల భార్యయైన ద్రౌపది ప్రతిజ్ఞను ప్రస్తావనకుతెచ్చాడు. దుర్యోధన, దుశ్శాసనులిద్దరు ద్రౌపదిని క్రూరంగా అవమానించారు. నిండుసభలో జుట్టుపట్టు కొని ఈడ్చారు ప్రతీకార వాంఛతో ఆ అగ్నిశిఖ అనాడే ప్రతిజ్ఞ చేసింది. "ఆ దుష్టుల రక్తంతో తడిపినంతవరకు నేను ఈజుట్టు ముడివేయను." పదమూడేళ్ళ తరవాత ఆ ప్రతిజ్ఞ నెరవేరింది.

ఇంతేకాకుండా ముడు ద్రోణపుత్రుడైన అశ్వద్ధామ మెదడుచీల్చి అందులోని మణి పట్టుకెళ్ళి ద్రౌపదిచేతిలోపెట్టాడు. ఎందుకంటే, మూర్ఖుడైన ఆ గురుపుత్రుడు ద్రౌపదియొక్క ఐదుగురు కొడుకులను నిర్దాక్షిణ్యంగా చంపివేశాడు. వాస్తవంలో తాను పంచపాండవులనే చంపాలనుకొని వెళ్లాడు. కాని తన సంక ల్పం మరొక దూరదృష్టిగలవానికి తెలిసిపోయింది. చీకట్లో తండ్రు

లకు బదులుగా కొడుకుల గొంతులుకోసి ఆ మూఢుడు సంతోషంతో వెళ్లిపోయాడు. భీముడు అతడితల పగులగొట్టి ప కారం ర్చు కొని తనప్రియురాలిని ంతోషపెట్టాడు. ఈ కథనంతా కవి పరో క్షంగా చెప్పాడు.

పాండవుల శిబిరంనుండి జయజయ ధ్వనులు బయలువెడ లాయి - పాండవులకు జై, ధర్మరాజుకు జై - ఆ నినాదం ప్రతి ధ్వనిరూపంలో వాళ్లవద్దకేచేరింది. ఎందుకంటే కౌరవపక్షమంతా చనిపోయారుగదా! ఆ ప్రతిధ్వని ఏమంటుందో చూడండీ —

"దేఖ్ లో, బాహర్ మహాసున్‌సాన్ హై,
సాలతాజిన్ కాహృదయ్ మైం, లోగ్ వేసబ్ జా చు ."

"చూడండీ! బయట అంతా మహానిశ్శబ్దంగావుంది. వాళ్లంతా చచ్చారు గదా! ఇకనేను ఎవరిహృదయాన్ని బాధించను?"

ఈ ప్రతిధ్వని పలుకులను కవి బహు చమత్కారంగా చిత్రించాడు.

శత్రుపక్షంలోవారు కొంతమందైనా బ్రతికివుంటే, ఈ విజ యోన్మాదపు ఆనందం వాళ్ళహృదయాలను బాధించగలదు. కాని వాళ్లంతా చనిపోయి ఆవలిఒడుకు చేరిపోయారు ఈ విజయం పొందినవారుకూడా ఒకనాటికి అక్కడకు చేరుకోవలసిందేగదా! అలాంటప్పుడు ఈ జయజయధ్వనులు వ్యంగ ంగా విజయం పొం

దినవారినే పీడిస్తాయి. కానీ ఆధ్వనులు వినడానికి చెవులుకావాలి. మనస్సుకావాలి. ఇంకా చెప్పాలంటే, సానుభూతి చూపగల ఉదారమైన హృదయంకావాలి. ఇలాంటి హృదయం పాండవుల్లో 'ధర రాజు' అనిపించుకొనే యుధిష్ఠిరుడికితప్ప మరెవరికున్నది? కాబట్టి కవి ఆ ధర్మరాజును కన్నీరుకారుస్తూ, ఆలోచనాసాగరంలో మునకలువేస్తున్నట్లు చూపించాడు. మహాభారతంయొక్క శాంతి పర్వంలో షు ని ప్రవచనాలు ప్రసిద్ధిచెందాయి. ఈ కవి వాటి ఆధారంతో తన ఆలోచనా కణాలను యుధిష్ఠిరునినోట చెప్పించాడు.

యుధిష్ఠిరుడు శాంతస్వభావం కలవాడు. మొదటినుండి యుద్ధాన్ని తప్పిస్తూవచ్చాడు. మతిభ్రమలోపడి ఆయనవల్లకూడా చాలా పొరబాట్లుజరిగాయి. చివరకు తప్పనిసరిఅయి తానుకూడా యుద్ధానికి తలపడ్డాడు. తానూ అస్త్రాలుపట్టాడు. ప్రజల గొంతులుకోశాడు. కాని ఇదంతా బయటి ఉద్విగ్నవాతావరణంవల్ల జరిగింది. కాని తన హృదయాంత రాళంలో హింసకు విరుద్ధంగా సంఘర్షణ జరుగుతూనే వచ్చింది. విజయం ల ంచగానే, అపారమైన ప్రాణనష్టం తన కళ్ళయెదుట కనిపించింది. ఎర్రనిరక్తపు ఏరులు పాములమాదిరి మెలికలుతిరుగుతూ బుసలుకొడుతూ ప్రవహించాయి. మాంసము, ఎముకలు, కొవ్వు మురిగిపోయి దుర్గంధం బయలుదేరింది. గద్దలు, నక్కలు, కుక్కలు, క్రిమి ట కాలు, కేకలు, అరుపులు, మూలుగులు, కోలాహలాలు, అట్టహాసాలు చేస్తుండగా భయంకరదృశ్యం తయారైంది. అది యుధిష్ఠిరుని ప్రాణాలను తోడిపారేసింది.

ఆలోచనా ధరాతలంపైన పైపైకి వస్తున్న పాండవాగ్రజుడికి ఎక్కణ్ణుండో దుర్యోధనుడిగొంతు వినిపించింది.

"మేము ఈ ఒడ్డుకు చేరిపోయాము.
నీవు ఆ ఒడ్డున్నే వుండిపోయావు.
ఈ పరాజయం ఎవరిది? జయం ఎవరిది?"

జయాపజయాలు ఎవరికి లభించినా, విజయంపొందిన పురుషుడికి మానసికక్షోభమాత్రం తప్పకుండా కలిగింది. ధర్మరాజు అనిపించుకొనికూడా ఇంతమంది అసహాయులను వధించినందుకు ఆయనకు చివరకు ఏం మిగిలింది?

ద్రౌపదికిమాత్రం విజయకానుక లభించింది. ఆమె దివ్య వస్త్రాలంకృతయై తృప్తినొందింది. కాని ఆ ఒక్కస్త్రీ మానావమానాల అగ్ని సృష్టించిన జ్వాలల్లో కోటానకోట్ల అసహాయస్త్రీల భర్తలు, పుత్రులు మాడి భస్మమైపోయారు. అయ్యో! ఒక్కస్త్రీకోసం ఇంతమంది స్త్రీల సర్వనాశనమా! తన ప్రియపుత్రుడైన అభిమన్యుడుకూడా ఆ అగ్ని ఆహుతి అయాడు.

ఇలా ఆలోచించినమీదట యుధిష్ఠిరుని నెత్తిన పిడుగు పడ్డట్లయింది. అతడు బాధపడుతూ అర్జునిడితో ఇలా అన్నాడు, "పార్థా! నేను పితామహునివద్దకు వెళ్తున్నాను."

ఇలాఅంటూ కురుక్షేత్రంలో విజయంపొందిన వీరుడు హృదయాన్ని తవిడిచూసుకుంటూ ష పితామహుని చెంతకు చేరుకొన్నాడు.

# ద్వితీయ సర్గ

ఈ సర్గలో భీష్మ పితామహుడు యుధిష్ఠిరుని దుఃఖాన్ని, సంతాపాన్ని నిశితంగా పరిశీలిస్తాడు. ఆయనముందు ధర్మరాజు ప్రశ్న ఒకే ఒకటి వుంది.

అపజయం ఎవరికి కలిగింది?
కౌరవులకా లేక పాండవులకా?''

పాండవులే జయించినట్లయితే యుధిష్ఠిరుడు ఇవాళ ఈ విధంగా హృదయవిదారకమైన వేదనతో ఎందుకు బాధపడుతున్నాడు? ప్రియమైన బంధుజనుల చితిజ్వాలలు చూడడానికే ఈ విజయం లభించిందా? అభిమన్యులాంటి కొడుకును పోగొట్టుకొని పరిమళ ప్రతిమలాంటి ఉత్తర ఆర్తనాదం వినడానికే పాండవులు కురుక్షేత్రంలో దూకారా? ఘోరపరిణామాలనే 'విజయం' అంటారా? ఇందుకు బదులుగా సహనశీలతతోబాటు, త్యాగశీలతతో దుర్యోధనుణ్ణి జయించగలిగితే, అతని హృదయపరివర్తనం చేయగలిగితే ఈ అపారమైన మారణహోమం వికటాట్టహాసం చేయకుండా వుండేదిగదా? ఈ మహాపాపం, అనాచారం, అధర్మం గర్జించకుండా వుండేవికదా?

యుధిష్ఠిరుడు తానుచేసిన మోసాలు కుతంత్రాలుకూడా ప్రస్తావనకు తెచ్చాడు. వాటివల్లనే భీష్మపితామహుడులాంటి వాళ్ళను నేలకూల్చగలిగాడు. దుర్యోధనాది వీరులను చంపగలిగాడు.

"మాలో ఎవరం ఏపాపంవల్ల బ్రతికివున్నాము?" ఇది యుధిష్ఠిరుని మరో ప్రశ్న.

చివరకు యుధిష్ఠిరుడు అడవులకువెళ్ళి ముఖం దాచుకోవాలనుకున్నాడు. అక్కడైతే తన పాపిష్టిముఖం ఎవరూచూడలేరు. 'ధర్మరాజు!' అని ఎవరూ ఎగతాళిచేయలేరు.

యుధిష్ఠిరుని ఈ సముద్రంలాంటి అపార ఔదార్యము, ఆకాశంలాగా సర్వవ్యాప్తమైన సానుభూతిచూసి భీష్ముడు తనలో తాను ముగ్ధుడైపోయాడు. ఈలాంటి గుణశీలసౌందర్యాలు ఏవ్యక్తికైనా గొప్పఅదృష్టం అనుకొన్నాడు. అంతేకాకుండా సంఘర్షణకు భయపడి అడవులకువెళ్ళి ముఖందాచుకోవాలనే సంకల్పం కొంచెం అసహ్యం అనిపించింది.

ష్ముడు తనఉద్దేశ్యంచెబుతూ "సుస్థిరమనస్సుగల మనస్వియైన పురుషుడు సంఘర్షణల్లోనుండి తప్పించుకొని పారిపోవాలనుకోడు. వాటిపరిణామాలగురించి ఆలోచించి తనకర్తవ్యమార్గమేమిటో నిర్ణయించుకుంటాడు.

తుపాను ఊరకనే బయలుదేరదు. దానికి ఎన్నో కారణాలుంటాయి. అలాగే మానవుల హృదయావేదనలుకూడా ఒకదానితో ఒకటి ఢీకొన్నపుడు యుద్ధమనే ప్రేలుడుతప్పదు. అదే ఒక్కొక్కప్పుడు దేశప్రేమ కారణంగా జరిగితే మరొకప్పుడు రాజ

య కారణాలనే ముసుగు కప్పుకొని హంగామా చేస్తూవుంటుంది. కాని అన్నిటి మూలకారణం స్వార్థపూర్ణమైన విద్వేషం, ఈర్ష్యల వల్ల ఏర్పడ్డ హాలాహలమే'' అంటాడు.

షు డు యుద్ధంఅనే వునా దం అంటు రోగంలాంటిదం టాడు. అగ్నిజ్వాలలాగా అది ఒకరినుండి మరొకరికి వ్యాపిస్తూ వుంటుంది. అలాంటప్పుడు మంచి చెడ్డలగుంచి ఆలోచించే బుద్ధి మరుగునపడిపోతుంది, అనికూడా అంటాడు.

యుద్ధాలనుగురించి షు డు ధర రాజుకు ఇలా బోధించాడు.

''రోగానికి చేదుమందు అవసరమైనట్లే ఆత్మ మానానికి యుద్ధం తప్పనిసరి అవుతుంది. పాపపుణ్యాలనే దుర్బలమైన భావా లను యుద్ధాగ్నిలోకి ఈడ్చుకరా ము. ఆసక్తిలేకపోయినా కర్త వ్యాన్ని పాటించవలసివుంటుంది అన్యాయాన్ని ఎదుర్కొనక పోవడంకూడా ఒక గొప్ప అన్యాయం. కాబట్టి అక్కడ (యుద్ధ రంగమందు) నిప్పులాగ మండిపోవడమే శ్రేష్ఠధర్మమవుతుంది. దాన్నే 'వీరత్వము' అంటారు.

ఈ విధంగా యుద్ధం అనివార్యం అయినప్పుడు ఇక దాన్ని గురించి ఏడ్వడం మొత్తుకోవడం మంచిదికాదు. ఒకవేళ పాండ వులు అడవుల్లోనే దాగివున్నా కురుక్షేత్రయుద్ధం జరిగేతీరేది!''

అటు తరవాత మహాజ్ఞాని భీషు డు ధర్మముయొక్క గూఢా ర్థాన్ని ఇలా చెబుతాడు.

తపస్సు, కరుణ, క్షమా వ్యక్తియొక్క ధర్మాలు. వినయము, త్యాగంతోనే వ్యక్తి శోభిల్లుతాడు. కాని ఎప్పుడైనా ఎక్కువ జనసముదాయాన్ని గురించిన ప్రశ్న ఎదురైనప్పుడు మనము మన తపస్సును, త్యాగాన్ని మరచిపోవలసివుంటుంది."

భీష్ముడు ముక్త కంఠంతో యుధిష్ఠిరుని కరుణ భావనను ప్రశంసిస్తూ "వలం కౌరవసంహారాన్ని గురించే ఎందుకు ఆలోచిస్తావు." అని అడిగాడు.

"పాండవపక్షానవున్న జనసముదాయం పాండవులయెడల జరిగిన అన్యాయానికి, హత్యాచారాలకు ఎంత వ్యాకులతపడింది? ద్రౌపది అవమానంచూచి వాళ్ళకళ్లల్లో ఎంత తీవ్రమైన ప్రతీకార భావన మేల్కొన్నది? ద్రౌపది అవమానం వాళ్ళు తమ అవమానంగా భావించలేదా? ఆనాడు గొర్రెలమాదిరి తలలు వంచుకొని సభలోనుండి గుట్టుగా బయటికివెళ్ళిపోవడం పాండవుల 'సద్ధర్మము'గా భావించబడలేదా?" ఇలా అంటూ అంటూ భీష్ముడు పిరికి పందల మాటలపైన అవమానపూర్వకంగా విరుచుక పడతాడు.

" జాతి మందిర్ మేం జలాకర్ శూరతా ఆరతీ,
జా రహాహూం విశ్వసే చఢ్ యుద్ధ హీ యానపర్ "

"జాతిమందిరంలో శూరత్వమనే ఆరతి వెలిగించి యుద్ధమనే వాహనంపైఎక్కి ఈ లోకంనుండే వెళ్లిపోతున్నాను."

కురుక్షేత్రం

భీష్ముని సుదీర్ఘ జీవితపుసారము ఎంత భావగర్భితంగా, ఎంత సత్యంగావుంది!

తదుపరి భీష్ముడు దుష్టులైన ప్రాణులమధ్య మనోబలంకంటే, శరీరబలమే శ్రేష్ఠమైనదని దృఢపరుస్తాడు.



# తృతీయ సర్గ

ఈ సర్గలో శాంతి అశాంతుల వివేచనచేస్తూ ఋషి ప్రవ చనాలుమాత్రమే వున్నాయి.

ఆయన దృష్టిలో రెండురకాలైన శాంతి కనిపిస్తున్నది. కృత్రిమశాంతి; వాస్తవశాంతి, కృత్రిమశాంతి అనేది కొంత మంది స్వార్థపరులైన వ్యక్తులద్వారా అవినీతి, హత్యాచారాల ఆధా రంపైన సమకూర్చినట్టిది. ఇందులో ముఖ్యమైన మంత్రం, ఆక టితో ఆలమటించేవారి నోటికాడిముద్ద గుంజుకొని తినడం, ఒకవేళ ఎవరైనా ఎదిరిస్తే కర్ర ఝళిపించి వాళ్ళను అణగద్రొక్కడం. పెట్టుబడిదారీ పరిపాలనావ్యవస్థలో కవికి ఇలాంటి కృతిమశాంతియే కనిపిస్తుంది. అందులో కొన్ని కోట్లమంది సంపాదనను కొంత మంది నేర్పరులు అనుభవిస్తారు. వాళ్లశక్తినంతా కూడగట్టుకొని ఆ శాంతిని నిలబెట్టడానికి ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తూ వుంటారు. ఆ కృత్రిమశాంతియే అశాంతికి మూలము. అది పైకి శాంతిగావుండి లోలోపల రగులుకుంటూ వుంటుంది.

ఆ వేడి బూడిదలోనుండి నిప్పురవ్వలు ఎగరడం మొదలె డితే, అవి జగత్తునే కాల్చివేస్తే, ఎవరూ 'పాపం' అని అనరు. అది దాని స్వాభావిక పరిణామమే. ఎవరైతే నిప్పురాజేసి, ఇత

రులను దహింపచేశారో, అదే తిరగబడి ఆ రా సినవాళ్ళనే దహింప జేస్తే గాబరాపడవలసిన అవసరం ఏముంది? యుధిష్ఠిరుడు యుద్ధం కావాలని కోరలేదు. కేవలం తన అధికారాన్నే అడిగాడు. కాని ఎవరైతే మోసంతో, బలంతో ఆయనకు న్యాయంగా రావలసిన అధికారాన్ని కాజేశారో, వాళ్ళు ఆయన నోటికికూడా తాళంవేయాలనుకొన్నారు. అలాంటివాళ్ళతో పోరాడి తమ అధికారాన్ని తిరిగి చేపట్టుకోవడం పుణ్యకార్యమేగాని, పాపంకాదు. ఆపాపులంతా తమ పాప తాపంలోపడి మాడిపోయారు. వాళ్ళకోసరం ఏడవడం, సంతాపం చెందడం వ్యర్థమేగాకుండా అజ్ఞానంకూడా.

ఆనక షృుడు వాస్తవశాంతిని గురించి ఇలా వివరించాడు. దానికి ఆయన చెప్పిన ప్రధానసూత్రమేమంటే –

" ఒకరికి మరీ ఎక్కువా వొద్దు,
మరొకరికి తక్కువా వొద్దు."

"నాయంపైననే అశాంతికి పునాది వేయబడుతుంది. ఎక్కడైతే అన్యాయమే ఆధారశిలగా వుంటుందో దాన్ని పెరికిపారవేయడమే పరమధర ం. న్యాయంగా రావలసిన అధికారం అడిగినంత మాత్రంచేత ల ంచకపోతే, వీరులైనవాళ్ళు యుద్ధంలో పోరాడి తీసుకొంటారు. లేదా స్వయంగా చనిపోతారు.

మరి, ధర జ్ఞుడైన యుధిష్ఠిరుడు యుద్ధానంతరం చావు బ్రతుకులను గురించి యెందుకు ఏడుస్తాడు? ఇలాచేయదలిస్తే

రాజ్యం పొందాలనేలోభం అతనిమనస్సులో యెందుకు తలెత్తింది? వాళ్ళంతా తపస్వికులై అడవులవెంటబడి తిరుగుతూవుంటే ఎంతో బాగుండేది. వాళ్ళ తపస్సు, వాళ్ళ కష్టాలనుచూసి దుర్యోధనుడి హృదయం లేశమాత్రమైనా కరిగిందా? రవ్వంతైనా దయచూపాడా? లేదు, సంఘటితమైన హింస దుర్బలుని అహింసను ఎప్పుడూ లెక్కచేయదు. క్షమా, దయా, వినయము, త్యాగము, తపస్సు ఇవన్నియూ పిరికివాడి ఆభరణాలని ఎగతాళిచేస్తారు. ఏ పాములో విషంవుంటుందో, దాన్నిచూసేప్రజలు భయపడతారు. శక్తివంతుడి శాంతి ప్రవచనాలకే విలువ ఎక్కువగా వుంటుంది. దెబ్బకొట్టడానికి చేతగానివాడు పండును ఎలా పంచిపెట్టగలడు?

గాలి తగలగానే రాజుకోవడం నిప్పు స్వభావమైనట్లే, ప్రతీకారమనేది వీరుని పౌరుషాన్ని ప్రజ్వలింపజేస్తుంది.

ఘ డుకూడా కరుణ, ప్రేమ, అహింసలను స్థాపించాలనే అనుకొంటాడు. కాని మానవజగత్తు ఇంకా దారిమధ్యలోనేవున్నట్లు ఆయనకు కనిపిస్తుంది. పొరపాటున దారితప్పి ఎప్పుడైనా, ఎవరిలోనైనా ఏదేనా ఆదర్శం వూడిపడుతూవుంటుంది. ఆలాంటిదే ఇప్పుడు యుధిష్ఠిరుని ప్రాణాల్లో కొట్టుకలాడుతుంది. కాని రాగద్వేషాలతో నిండిన అభేద్యమైన దుర్గము ఆయనయెదుట నిలబడింది. ఎగిరిపోవడంతప్ప మరోమార్గం కనిపించడంలేదు. ఇటు యుధిష్ఠిరుడు ఒక్కడైతే, అటు దుర్యోధనులకు కొరతలేదు.

అలాంటప్పుడు శాంతిసామ్రాజ్యం ఎలా స్థాపితమవుతుందీ? పైపైకి ఎవడైతే మంచివాడుగా కనిపిస్తూవుంటాడో, ఎవడిమాటల్లో తేనె లూరుతూవుంటాయో, ఎవడి వొంటిపైన పరిశుభ్రమైన వస్త్రాలు వుంటాయో, అలాంటివాడిని ష్మడు విషపుకోరలుగల భుజంగ మంటాడు. కురుక్షేత్రపు చితిలో ఆ విషసర్పమే దహించుక పోయింది. అంటూ ఒక మార్మిక ప్రశ్న వేశాడు -

"పాపీకౌన్? మనుజసే వుస్‌కాన్యాయ్ చురానేవాలా?
యా కిన్యాయ్ ఖోజనే విఘ్నకాశీశ్ ఉడానేవాలా?"

"ఎవడుపాపి? మనుష్యుడినుండి అతడి న్యాయాన్ని దోచుకొనేవాడా? లేక న్యాయాన్ని వెదుకుతూ విఘ్నాలశిరస్సును ఎగరగొట్టేవాడా?"

మూడవసర్గ ఇంతటితో సమాప్తమవుతుంది. కాని భీష్మని ఈప్రశ్న పాఠకుల మనస్సులో దీర్ఘకాలంవరకు ప్రతిధ్వనిస్తూ వుంటుంది.



# చతుర్థ సర్గ

ఈ సర్గలో ముఖ్యంగా భీష్ముని అంతరాత ప్రబోధం విని పించబడింది.

గజరాజువలె అంపశయ్యపై పరుండివున్న ష్ముడు ఆలోచనా ధరాతలంనుండి ఒక్కమారు అంతరాత్మవేపు తొంగిచూశాడు. సముద్రంలాంటి ఆయన హృదయం అల్లకల్లోలంగా కనపడింది. తదుపరి అందులోని రత్నరాసులు ఒక్కొక్కటే దర్శనమిచ్చాయి. ఆయన అంతరాత్మ ఏమంటుందంటే :—

"ఎవడైతే 'న్యాయాన్ని' దోచుకుంటాడో, యుద్ధానికికూడా తానే కాలుదువ్వుతాడు, యుద్ధాలవల్లవచ్చే పాపతాపాలకు జవాబుదారీకూడా తానే. మనిషి సహజంగా శాంతిప్రియుడు. అనవసరంగా ఇతరులతో తగవులాడడం పోట్లాడడం కోరడు. కాని స్వార్థము మనిషిని రాక్షసుడిగా మారుస్తుంది. అప్పుడు ఇకఅతడు శాంతిసందేశంవినడు. ఏసత్పురుషులైతే అతణ్ణి ఎదిరించరో వాళ్ల తమ సహనశీలముతో అతడి రాక్షసత్వాన్ని ప్రోత్సహించిన వాళ్లవుతారు."

ష్ముడు భారతయుద్ధాన్ని కేవలం కౌరవపాండవయుద్ధంగా భావించడం దు. ఆయనకు అందులో ఎంతోమంది క్రోధాగ్ని

కనిపించింది. అది సమస్త భారతదేశమనబడే అగ్నిపర్వతపు ప్రేలుడు. అనేక తరాలుగా విషవాయువులు వ్యాపిస్తూవచ్చాయి. ఒకడు మరొకడి వీరత్వాన్నిచూసి మండిపడుతూవచ్చాడు. ఒకడు మరొకడి క్రూరత్వానికి బలిఅయిపోతూవచ్చాడు. ఒకడిమేలు చూసి మరొకడికి కన్నుకుట్టింది. కొంతమంది ప్ర తీకారంకోసం సిద్ధపడి కూర్చున్నారు. ఉదాహరణకు కర్ణుడు అర్జునుని వధించ డానికి ఎదురుచూస్తూ వచ్చాడు. ద్రుపదుడు ద్రోణుడిపైన ప్ర తీకారం తీర్చుకోవాలనుకుంటూ వచ్చాడు. కుటిలుడైన శకుని తన తండ్రిఆత్మకు తృప్తికలిగించాలని ప్రయత్నంచేస్తూ వచ్చాడు. అందుకనే దుర్యోధనుణ్ణి రెచ్చగొడుతూవచ్చాడు. ఎక్కడెక్క డున్న అగ్నికణాలన్నీ యుద్ధంవస్తే మండిపోదామని కాచుక కూర్చున్నాయి.

ఇందులో సంస్కారాలపేరిట కృష్ణునిచేయికూడా భీష్మడికి కనిపించింది. ఆయనఅంటే పడనివాళ్లు శత్రువర్గంలో చేరిపో యారు కృష్ణుడు వాచాలుడైన శిశుపాలుని శిరస్సు ఖండించాడు. దీనితో విచ్చలవిడిగా ప్రవర్తించేవాళ్ళ గర్వంతగ్గిందు కాని మరు గున దాగివుండిపోయింది.

ఈ విధంగా చాలాముందునుండే ప్రజలు రాగద్వేషాలపేరిట రెండువర్గాలుగా విడిపోతూవచ్చారు. దాని పరిణామమే కురుక్షేత్ర యుద్ధం. యుధిష్ఠిరుని రాజసూయయజ్ఞంతో రాగద్వేషాలకలశం

పూర్తిగా నిండిపోయింది. కృష్ణుడు ఆయజ్ఞంద్వారా భారతదేశంలో ఐకమత్యాన్ని నెలకొల్పాలనుకున్నాడు. కాని దెబ్బతిన్న అభిమాన ధనులకు ఆయజ్ఞం ఇంద్రప్రస్థ వైభవాన్ని గుప్తంగా పెంపొందించ డానికే పుద్దేశించబడినట్లు అగుపించింది. ఆ మహాయజ్ఞానికి వచ్చిన వాళ్ళలో కొంతమంది భక్తిభావంతోవస్తే మరికొంతమంది ఖడ్గానికి భయప వచ్చారు.

అప్పుడు ఆ అ మానుల్లో యుధిష్ఠిరుని ఎడల చూపించిన అనునయ వినయాలమాటున వాళ్ళనెత్తిన బానిసతనం సవారీచేస్తు న్నట్లనిపించింది, ఈ విధంగా ఆయజ్ఞం అనేక భూపాలుర అభి మానాన్ని రెచ్చగొట్టింది. దాంతో వాళ్ళంతా మరోరకపు భావనతో ఇంద్రప్రస్థంనుండి తిరిగి వెళ్లారు.

ఈ విధంగా ఒక ఏడాది గడిచిందో లేదో, భారతదేశపు దురదృష్టం జూదంపేరుతో దర్శనమిచ్చింది. ఆటమధ్యలో విష జాలు నాటబడ్డాయి. ఆ రాజసూయ యజ్ఞంనాటి వైభవాన్నిచూసి కన్నుకుట్టిన దుర్యోధనుడు శకుని సలహామేరకు 'జూదం' కొరకు పాండవులకు ఆహ్వానం పంపాడు. ధర రాజు దాన్ని స్వీకరిం చాడు. ద్రౌపది స్వయంవర సభలో తాను పొందిన అవమానం వల్ల కలిగిన ద్వేషాగ్నితో దుర్యోధనుడు నిండుసభలో ద్రౌపది మానభంగంచేశాడు,

ఆ లజ్జాకరమైన దృశ్యం జ్ఞాపకంరాగానే భీష్ముడు తపించి పోయాడు. ధర్మరాజును అడిగాడు. "ఆనాడు నీవూ ఓడి పోయావు, నేనూ ఓడిపోయాను. ఎందుకని? భుజాలు విరగ్గొట్టి ఆనాడే రక్తపుటేరులు ఎందుకు ప్రవహింపచేయలేదు?" భీష్ముడు తననుతాను ధిక్కరించుకొన్నాడు. ఎందువల్లనంటే, ఆయన అంతకుముందు ఎన్నడూ ఈ విధంగా అన్యాయాలు, హత్యాచారాలు నగ్నంగా తాండవంచేస్తూవుంటే, సహించి వూరుకోలేదు. కాని, ఆనాడు? రానున్న తరాలవాళ్ళు ఇందుకుగాను భీష్మణ్ణి దూషిస్తూ వుండవచ్చు.

తదుపరి భీష్ముడు నిజమైన వీరధర్మాన్నిగురించి ఈవిధంగా వివు కరించాడు. "ఎప్పుడూ వెలిగిపోతూవుండం వీరుడైన మానవుడి పరమోన్నతధర్మం. దహించుకపోయే శక్తిని కూడగట్టుకుంటూ మరొకడి స్పర్శనుకూడా సహించకుండా వుండడం వాడి స్వభావం.

కాని బుద్ధి ఆ వీరధర్మానికి శత్రువు. అదే ఆనాడు భీష్ముడి శౌర్యాగ్నిమీద చన్నీళ్లుచల్లింది. ఆ కారణంగా కులవధువు అయిన ద్రౌపది అవమానాన్నిచూస్తూ మౌనంగా వుండిపోయాడు. వీరధర్మం బుద్ధిని సలహాఅడగదు. అది బుద్ధిఅనే దీపాన్ని ఆర్పివేసి, కళ్లుమూసుకొని వేదికపైకిఎగిరి గంతువేస్తుంది. తనకు తాను వెలిగిపోతూ వుంటుంది. వీరత్వము ఎప్పుడైనా బుద్ధిని సలహాఅడిగితే అది అవమానాలపాలై తనతేజస్సునే కోల్పోతుంది.

బుద్ధికి వశీభూతుడై పోయిన మనిషి - బలమా, వివేకమా? ఖడ్గమా, వినయమా? హింసాత్మకమైన విజయమా లేక కరుణతో కడిగివేసిన పరాజయమా? వీనిలో దేన్ని ఎన్నుకోవాలోననే చిక్కులో పడిపోతాడు, ఏదిగొప్పది? దేన్ని స్వీకరించాలి? వీరుల వయస్సు పెరిగేకొలదీ వాళ్ల పౌరుషం అలసిపోతుంది. తద్వారా అవమానకరమైన వితం గడపసాగుతారు. అలసిపోయిన సింహం ఆదర్శాలువల్లెవేస్తూ వ్యంగ్యబాణాలను సహిస్తూ వుంటుంది!"

ఇలా చెబుతూ చెబుతూవుండగా భీష్ముడికి తన యౌవనం జ్ఞప్తికి వచ్చింది. ఆయన యౌవన ప్రభాతకాలం ఎంతోగౌరవ మయంగావుండేది. కాని వయస్సుపెరిగేకొలది ఆ స్వేచ్ఛాయుత మైన యౌవనం దుర్యోధనుడివలలో చిక్కిపోయింది. అక్కడ ఆయనకు ధర్మమా? స్నేహమా? ఏదో ఒకటి ఎన్నుకోవలసి వచ్చింది. 'బుద్ధి' ధర్మమువేపు వేలెత్తిచూపుతూ ధుర్యోధనుణ్ణి అంటిపెట్టుకొని వుంచింది. కాని 'స్నేహం' హృదయాన్ని అర్పించి పాండవులవేపు పరుగెత్తిపోయింది. ఈ విధంగా భీష్ముడు రెండు భాగాలైపోయాడు దేహాన్ని దుర్యోధనుడికి అర్పించివేస్తే, హృదయంలోని మమత పాండవులను చుట్టుకపోయింది. కాని ఒకనాటికి ఆ పంపకం అంతమొందింది. దేహంకూడా పాండవులకే అంకితమైపోయింది. బుద్ధి వల్లోపడి తన స్నేహాన్ని ఈ విధంగా అణచుకుంటూ వుండకపోతే, దుర్యోధనుణ్ణి బెదరించి, అతణ్ణి సరైన మార్గాన నడపగలిగి వుండేవాడు. కురువంశంలోని

అగ్ని ఈవిధంగా దావానలంకాకుండా వుండేది. తన ఈ బల హీనతకు మూలం తన ' ష్మ ' ప్రతిజ్ఞయే! దానివల్లనే ఆయన పేరు భీష్ముడు అయింది. జీవితాంతం బ్రహ్మచర్యవ్రతాన్ని అవలంబిస్తానన్న ఆ ప్రతిజ్ఞయే అతని హృదయాన్ని స్నేహరహితంగాచేసింది. కోమలత్వంవేపు నిష్ఠురత్వం బాణం ఎక్కుపెట్టి నిల్చుంది. ఈ కారణంగానే తాను స్వతంత్రించి తన ప్రియపాత్రులైన పాండవులపక్షాన్ని అవలంబించలేకపోయాడు అతని ఈ దుర్బలత్వము దుర్యోధనుడికి బాగాతెలుసు. అందుకనే అతడు నిరాటంకంగా విచ్చలవిడిగా ప్రవర్తిస్తూవచ్చాడు. భీష్ముడు చూస్తూ వుండిపోయాడు. దుర్యోధనుణ్ణి ఆణచలేకపోయాడు పాండవ పక్షాన్ని స్వీకరించలేకపోయాడు. ఈ విధంగా కురుక్షేత్రయుద్ధానికి తానుకూడా చాలావరకు కారకుడు



# పంచమ సర్గ

శారదాదేవిని సంబోధిస్తూ కవి ఈ సర్గను ఆరంభించాడు. తనను సంధికాలపు 'మానవుడు'గా చెప్పుకున్నాడు. ద్వాపరం ముగియబోతూవుంది. కలికాలపు ముఖం దర్శనమిస్తూవుంది. సంధి కాలం సహజంగా సంఘర్షణయుగంగా వుంటుంది. విశ్వమంతా అలజడిగావుంది. కవి శీతలఛాయకొరకు వెదుక్కుంటూ మహా భారత కాలంవరకూవచ్చాడు. కాని అక్కడి ఆకాశం ఆయనకు ఇంకా జ్వాలామయంగా అగుపించింది. అది సెగలుపొగలు కక్కుతున్నట్లు అనిపించింది. ఆకాల గుహనుండి అతడికి బడబాగ్నితో పొంగిపోయే సముద్రపు భయంకరఘోష వినపడింది. మహాభారత పుటలలోకూడా కవికి చింతాపూర్ణమైన అగ్నిపొగలులేస్తూ అగుపించింది. ఆ పొగలోనుండి అతడికి ఎవరిదో ఎగురుచున్న ఎఱ్ఱని జెండా కనిపించింది. ఏవరిదో రక్తసిక్తమైన శరీరంకూడా కనిపించింది. దానిచేతిలో కత్తివుంది. అది తన పొడవైన ఎఱ్ఱని నాలుకచాపి నాట్యం చేస్తూవుంది.

ఆ భయంకర కాలపురుషుడి ఒడిలో కవి ఒకగొప్ప యజ్ఞానికి ఏర్పాట్లుచూశాడు. అందులో మానవుడిమదమే గుఱ్ఱమై పరుగెత్తుతూంది. కవికి అది యజ్ఞంగాకుండా భూతలంమీది అకారణమైన విధ్వంసంగా కనిపించింది. ఆయజ్ఞానికి కలశాలతో రక్తం

మోస్తున్నట్లనిపించింది. కవికి అందులో మానవ రక్తమే సమ కూర్చుచున్నట్లనిపించింది. ఎందువల్లనంటే, కత్తి బెదిరింపు తోనే ఆ యజ్ఞం జరుపబడుతూవుంది.

ఈ యజ్ఞవర్ణన గూఢంగా, హృదయవిదారకంగా, వ్యం గ్యంగా చెబుతూ వున్నట్లనిపిస్తున్నది. క్రూరాతిక్రూరమైన నర సంహారం తదుపరి విజయంపొందిన సమ్రాట్ తన రాజ్యాభిషేక యజ్ఞం చేస్తాడు. ఓడిపోయిన రాజులు విధిలేక తమ అభిమా నాన్నే కానుకలుగా అర్పిస్తున్నట్లుగావుంది. యజ్ఞకుండంలో ఆహుతి ఇవ్వబడుతున్న నెయ్యి కవి దృష్టిలో రాజుల తిరస్కార అహంకారాలే మండిపోతూవున్నట్లు అనిపిస్తున్నది, వాళ్ల గర్వమే చూర్ణమైపోయి ఆ అగ్ని ధగధగా మెరుస్తున్నట్లున్నది. వేదపఠనం, స్వస్తివాచనం, యజ్ఞాంతస్నానం, ఇవన్నీ కవికి హింసాత్మక అట్ట హాసంగా కనిపిస్తున్నాయి.

కురుక్షేత్రకావ్య కవిహృదయం ఈ దృశ్యాన్ని చూసి వ్యథ చెంది మథనపడుతుంది. కవి ఆ ఆధారాలను పట్టుకొని కవివర్గం పైన వ్యంగ్యవచనాలను ఎగజల్లుతాడు. వాళ్లంతా సమ్రాట్టుల విజయోత్సవాలప్పుడు వాళ్లుచేసిన ఘోరహింసకు 'శౌర్యము' అనే పేరుపెట్టి దానికి మహత్తు ఆపాదిస్తారు. విజయం పేరుతో అన్ని దుష్కార్యాలను పుణ్యమయంచేస్తారు. మహాపాపియైన విజేత ముఖం దివ్యతేజస్సుతో మెరిసిపోతూవుంటుంది. ఆ ఉన్మాదంలో

అందరికళ్లూ మూసుకపోతాయి, అందరితెలివీ మంటగలిసి పోతుంది. పాపమంతా పుణ్యరూపంలో దర్శనమిస్తుంది.

ఇంత భూమిక తయారుచేసిన తదుపరి కవి ధర్మరాజును ముందుకుతెస్తాడు. సంకోచిస్తూ భయపడుతూవున్న విజయలక్ష్మి వరమాల చేతబట్టుకొని అతనియెదుట నిలబడుతుంది. కాని యుధిష్ఠిరుడు ఆమెను గుర్తించలేడు. కవి ఇక్కడ ఆ విజయలక్ష్మిని చీవాట్లుపెడుతూ నిర్మల మనస్సుతో సుందరంగా ఇలా చిత్రించాడు.

"సంహారసుతే! మదమత్త జయశ్రీబాలే!
హైఖడీ పాస్‌తూ కిస్‌కే వరమాలా లే ?
హోచుకా విదా, తల్‌వార్ ఉఠానేవాలే,
యహ్ హై కోయీ సామ్రాజ్యలుటానేవాలా."

"సంహారపుత్రీ, మదమత్త జయశ్రీబాలా, జయమాల పట్టుకొని ఎవరివద్దనిల్చొన్నావు? కత్తులనెత్తేవాడు గడచిపోయాడు. ఇతడెవరో సామ్రాజ్యాలను దోచుకొనేవాడు."

కవి యుధిష్ఠిరష సంభాషణ తిరిగి మొదలెట్టాడు. "శూరులు వీరులు అంతా దుర్యోధనుడితోటే ధ్వంసమైపోయారు. దేశమంతా మృతకళేబరాలతో నిండిపోయింది. బిడ్డలను పోగొట్టుకొన్న తల్లులు, అనాధలుమాత్రం మిగిలిపోయి ఏడుస్తున్నారు. సుఖశాంతులు కరువయాయి. రసరాగాలు మృగ్యమయ్యాయి. దుఃఖము, దైన్యము మాత్రమే మిగిలిపోయాయి. విజయుడైన

సమ్రాట్టుకు హృదయంవుంటే రాజ్యసుఖాన్ని అనుభవించడమే అదృష్టకానుక." అన్న యుధిష్ఠిరుని మాటలకు షన్ముడు మండిపడతాడు. అతని హృదయంలో చిరకాలాన్నుండి రాజ్యాన్ని ఏలాలని వున్న లోభాన్ని బయటికిలాగిచూపిస్తూ చీవాట్లు పెడతాడు.

షన్ముడి కటువచనాలకు ధర్మరాజు చలించడు సరిగదా, గంరంగా తన బలహీనతలను అంగీకరిస్తాడు. తన తుదినిర్ణయం కూడా వినిపిస్తాడు.

"పోరాటానికి దిగానన్న కళంకం ఎలాగూ రానేవచ్చింది. దీన్ని నేను ఇంకా పెద్దదిచేసుకోను."

అయితే ఇప్పుడాయుధిష్ఠిరుడు ఏంచేస్తాడు? నిజంగా రాజ్యకాంక్షయే అతణ్ణి కురుక్షేత్రంలోకి దించింది. ఆకాంక్ష మనస్సులో ఏంచివున్నంతవరకు అతడు విజేత ఎలా అవుతాడు? కాబట్టి ఆ కాంక్షను జయించడానికి మరోయుద్ధంచేస్తాడు. కురుక్షేత్రపు భస్మంతో ఇప్పుడు ఇదే జ్యోతి వెలుగుతుంది.



# షష్ఠ సర్గ

"భూమీ ద దయా ధరా లజ్యోతి వెలుగుతూ వుండాల"ని కోరుతూ కవి భగవంతుడి యెదుట బాధాపూరిత వచనాలతో నేరారోపణ చేస్తాడు.

షుడు, యుధిష్ఠిరుడు, కృష్ణుడు, స్తు, బుద్ధుడు, అశోకుడు, గాంధీ, ఇలా ఎందరో సాధుపురుషుల ముఖాలనుండి అమృత వర్షము ఈభూతలంమీద కురిసింది. కాని రాగద్వేషాలమంట ఇంత వరకు చల్లారలేదు. మానవుడు తన నోటితో ఆ మహాత్ములను ప్రశంసించాడు, కాని దుఃఖనివారణ విషయంలో తన పాతమార్గాన్ని అతడు వదల్లేదు. నేటి వైజ్ఞానికయుగం కవికి ఇంకా విచిత్రంగా కనిపిస్తున్నది. ఎక్కడచూసినా ప్రకృతిపైన విజయం పొందిన అ మానం కానవస్తున్నది. ప్రతిచోటా బుద్ధివికాసానికి పట్టం కడుతున్నారు. కాని ప్రాణాలతోవున్న మానవుడిస్థితి దిగజారిపోతూవుంది. మానవ ప్రాణానికి కావలసింది కేవలం జ్ఞాన విజ్ఞానాలుకాదు. అతడు కోమలమైన స్నేహాన్ని, దానికొరకు గొప్పగొప్ప బలిదానాలను కోరతాడు. ఇచ్చట కవియొక్క వర్ణన హృదయ గ్రాహ్యమైనది. మృదుమధురమైనది. అమృత రుచులతో ఎంతగా నిండివున్నదంటే, మనస్సు అలాంటి రమ్యమైన ఉద్యానవనంలో విహరించాలంటున్నది.

కవి ఏమంటున్నాడంటే, ఈ వైజ్ఞానిక యుగంలో దేహానికి చాలా సుఖం ల ంచింది. ఇప్పుడు మన దేవతలు మనస్సుకు ఒక చిన్న మందిరం కావాలంటున్నారు. ఆ మందిరం జ్ఞానవిజ్ఞానాల ఆధారంపైన ల ంచదు. మనిషి మనిషి మధ్యనున్న దూరం తొలగిననాడే అది లభించగలదు. ఏ మహాత్ము డైతే ఆదూరాన్ని తొలగించగలడో అతడే నిజమైన మానవుడు. కాని మానవుడు ఆశక్తిని మేధస్సుతోగాని, బుద్ధి, ప్రతిభలవల్లగాని, వైజ్ఞానిక చమత్కారాలవల్లగాని పొందలేడు.

మనిషి మనిషి మధ్య సంబంధాన్ని నిలబెట్టే కలకంటూ కవి ఈ సర్గను సమాప్తంచేశాడు.

ఈ సర్గలో కావ్యానికి అవసరమైన సహజగతి లోపించింది. ఈ సర్గను ఈకావ్యంనుండి వేరుచేసినా ఏమీ కొరతపడదు. ఎందువల్లనంటే ఈకావ్య క్రమంలో ఈసర్గకు నేరుగా ఏమీసంబంధంలేదు.

---

# స ప్త మ స ర్గ

పాప పంకిలంలో ఎవడు పడకుండా వుండగలడు? కాని ఆ పంకాన్ని కన్నీటిజలంతోనే కడిగివేయవచ్చు. యుధిష్ఠిరుని కన్నీటిని చూచి ష్మడు ఓదారుస్తాడు. ఈ కన్నీటి కణాల్లోనే మానవుని కళ్యాణవాంఛ దాగివుంది. కాబట్టి మానవసమాజాన్ని వదలివేసి అరణ్యవాసాన్ని గురించి ఆలోచించడం వట్టి అమాయకత్వం.

ఇలా చెబుతూచెబుతూ ష్మడి కళ్ళల్లో సమసామ్యభావము మెరిసిపోతుంది. ఆయన ఉద్యమాలకు ప్రబల ప్రశంసకుడు. అదృష్టవాదాన్ని నిందిస్తాడు.

ష్మడు అదృష్టవాదిని ధూర్తుడుగాను దోపి గాడుగాను అంగీకరిస్తాడు. ఈలాంటివాళ్ళు తమ చాకచక్యముతోను, బలప్రదర్శనతోను ఇతరుల సంపదను దోచుకొని తమను అదృష్టవంతులుగా చేసుకొంటారు. ఇలా చెబుతూ కవి పూర్వకాలపు మానవసమాజరూపాన్ని చూపించాడు. ఆదిలో రాజులు ప్రజలు, ఎక్కువ తక్కువ, ధనిక ద, ఇత్యాదిభేదాలు ఏర్పడకపూర్వం రాజదండన అనే భయం ఎవరి మనస్సుల్లోనూ వుండేదికాదు.

అకస్మికంగా ఒకప్పుడు చెడుకాలం దాపురించింది. ప్రజలు అన్నమో రామచంద్రా! అని ఆలమటించిపోయారు. కరువువచ్చి

కాలాన్ని కలవరపెట్టింది. సరసమైన మానవ మనస్సులో ఈ క్రూరకాండ లోభాన్ని మేల్కొలిపింది. ఏదోవిధంగా కొంత సమకూర్చిపెడిడే, ఇలా నిస్సహాయంగా చావాల్సిన అవసరంలేదు; అనే ఆలోచన మానవ మస్తిష్కంలో కలిగింది.

పెట్టుబడిదారి సిద్ధాంతాల ఆరంభం ఈ లాంటి చెడుపరిస్థితుల్లో కలిగింది. ఈ లోభమే సామాన్యమానవులను ఒకరినుండి ఒకర్ని వేరుచేయడం, ఎత్తుకు పైఎత్తు వేయడం, వగైరానేర్చుకోవడం మొదలైంది. లోభము ఇతరులసొత్తును కాజేయాలనే దారి వెతికింది. తదుపరి కాలంలో కత్తిబెదరింపుతో, దొంగతనాలతో ఆ కాజేయడాలను న్యాయసమ్మతమని రుజువుచేసుకోసాగారు. ఈ విధంగా ఎవడు కత్తిపట్టగలిగితే వాడే సమాజంలో ప్రతిష్ఠ పొంది రాజుగానో, మహారాజుగానో పదవులను చేపట్టగలిగాడు. ఈ విధంగా ఒక వేపున సుఖసమ్మానాల ఆడంబరము మొదలైతే మరోవేపు ఘోరమైన దౌన్యము, దుఃఖాలమధ్యలో ఆ భూపాలుర యెడల భక్తి భావనను దృఢతరం చేసుకొనే ప్రబల ప్రయత్నం జరుగుతూ వచ్చింది. రాచరికము ఇలాంటి ఇరువైపుల పదును గల కత్తిబలంతో సమాజపు సహజ పరంపరను త్రుంచివేసి దాన్ని ఈ కృత్రిమ ఇనపసంకెళ్ళలో బంధించి వేసింది. పరిపాలన, క్రమశిక్షణ అనేపేరుతో ఈచమత్కారాలన్నీ చూపిస్తూ వచ్చారు. మానవుడు పరస్పర విద్వేషం అధారంగా ఈ అవినీతికరమైన రాచరి

కాన్ని సమర్థిస్తూవచ్చాడు. ఇప్పుడు ఆ బలమైన లాఠీలవర్షం వాడి తలమీద కురుస్తూవుంటే, వాడు గిజగిజలాడి పరుగెత్తిపోతున్నాడు.

ఈ వరసలోనే భీష్ముడు యోగులను, తపస్వికులను, సాధువులను, సన్యాసులను వ్యాఖ్యానించాడు. వాళ్లంతా వర్తమానాన్ని తిరస్కరిస్తూ అహర్నిశము మృత్యువునే జపిస్తూవుంటారు. వాళ్ళందర్నీ 'అకర్మణ్యులు' అంటాడు. ఎవడైతే కర్మచేస్తూ జగత్తు నుండి సెలవు సుకుంటాడో వాణ్ణి కర్మనిష్ఠుడు అని భూతల భాగ్యాన్ని కొనియాడుతాడు. ఒకవేళ జగత్తు నశ్వరమైనదైతే వివేక లైన నరులు దానికొరకు రాత్రింబగళ్ళు తలగోక్కోవడం దేనికి? మానవుడు ఈ నశ్వరలోకంలోకి పంపబడ్డాడుగదా, మరి ఇందులోనే కోమలమైన పూలుపూస్తూ ఎందుకు వుండకూడదు? ఒక పువ్వుపూసింది, మరొకటి వాడిపోయింది. అతడు రెంటినీ రస పూర్ణమైన దృష్టితోనేచూస్తాడు. ఎవడైతే వలం మానసికంగా స్వర్గంలో వుంటాడో, వాడుకూడా భ్రమలోపడితోతాడు. కేవలం శరీరాన్నే చూసుకొనేవాడుకూడా భ్రమలోపడిపోతాడు. చింతన కర్మలమధ్య, దేహము మనస్సులమధ్య ఎవడైతే సామంజసం స్థాపించగలుగుతాడో, వాడే వాస్తవంలో మనస్వి, మానవ సృష్టికి ఆ భూషణము.

ఈవిధంగా కర్మవీరులను ప్రశంసిస్తూ నిష్కామకర చేయవలసిందిగా పాండవరాజునికి సందేశం చెబుతాడు ష్ముడు.

"ఛోంధో అశ్రు, ఉఠో, ద్రుతజావో,
వనమేఁ నహీఁ, భువనమేఁ.
హోవో ఖడే అసంఖ్య నరోం
ఆశాబన్ -వన్ మేఁ."

"జీవితంలో అసంఖ్యాకమైన మానవులకు ఆశాజ్యోతివై లేచి నిలబడు, కన్నీరు తుడుచుకో, లే, త్వరగావెళ్లు. అరణ్యానికిగాదు, భవనంలోకి."

ఈవిధంగా యుధిష్ఠిరునికి నిష్కామకర్మ పాఠం చెప్పడంతో కావ్యం సమాప్తమవుతుంది.



# శ్రీ జయశంకర్ ప్రసాద్

శ్రీ జయశంకర్ ప్రసాద్‌గారు 889 లో కాశీపట్టణంలోని ఒక పేరుగాంచిన వైశ్యకుటుంబంలో జని ంచారు. ఇంటివద్దనే ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, సంస్కృతం బాగా అధ్యయనంచేశారు. బాల్యంనుండే కవిత్వంపట్ల ఆసక్తివుండేది. పదిహేనవఏటనే కవిత్వం వ్రాయడం మొదలెట్టారు. తన రచనలద్వారాను, రచనా ప్రవృత్తిద్వారాను ఒక యుగనిర్మాతగా గణతికెక్కారు. ''ప్రసాద్ యుగం'' పేరిట హిందీసాహిత్యంలో యుగ నిరా తలయ్యారు.

ఈయన మానవతావాది. ప్రాచీన భార య సంస్కృతి ఈయన రచనలకు ఆధారశిల. మానవీయ భావనలు ఆరోపిస్తూ జడ ప్రకృతిని చైతన్యవంతంచేశారు.

ఈయన ఒక మహాకవి. సర్వ శ్రేష్ఠ నాటకకారుడు. ప్రముఖ కథారచయిత. నవలలుకూడా వ్రాశాడు. సమీక్షాత క వా సాలు వ్రాయడంలో నేర్పరి. ఈయన రచనలన్నీ ఎక్కువగా చారిత్రాత కమైనవి.

"కామాయని" ఈయన సర్వోత్కృష్టమైనరచన. ఈ అనుపమ మహాకావ రచనతో ఈయన అమరుడయా డు. ఈయన

ప్ర జయశంకర్ ప్రసాద్

యొక్క తదుపరి ప్రముఖరచన "ఆఁసూ" శిల్పముదృష్ట్యా ఇది అసాధారణకావ్యము. మరో ఆరు పద్యకావ్యాలు, స్కందగుప్త, చంద్రగుప్త, అజాతశత్రు మొదలగు తొమ్మిది చారిత్రాత్మక నాటకాలు, మూడునవలలు, ఒక అరడజనుకుపైగా కథా సంపుటాలు కొన్ని సాహిత్యక వ్యాసాలు వ్రాశారు ఈయనభాష సంస్కృతి భూయిష్టమైననూ లలిత మధుర పదాలతో నిండివుంటుంది. ఈయన 937 లోనే స్వర్గస్థులయ్యారు.

~~~~~~~~
~~~~~~~~

# 'కామాయని' కావ్య సౌందర్యం

శ్రీ జయశంకర్ ప్రసాద్ రచనలన్నిటిలో "కామాయని" మకుటాయమానం. ఈ భావగర్భితమైన బృహత్కావ్యం హిందీలోనేగాక విశ్వసాహిత్యానికే గౌరవగ్రంథంగా భావింపబడుతుంది. ఇది ధర సమ తమైన కామాన్ని రసవంతంగా వివరించే కమనీయ కళాఖండం.

"కా మా య ని" పేరులో మనకు ప్రత్యేకత కనుపించకపోయినా మానవ మనస్సుకు ఏదో సన్నిహితత్వం ఉన్నట్లనిపిస్తుంది. అందులో ఇమిడియున్న 'కామ'ము రాత్రింబగళ్లు మనకెంతో సన్నిహితమైనది.

ప్రాచీన కావ్యాల్లో అక్కడక్కడా ఈకామాయని సంబంధమైన ప్రస్తావనలు అగుపిస్తున్నాయి. ఈ కావ్యము 'వైవస్వత మను' చరిత్ర ఆధారంగా వ్రాయబడింది.

కామాయని పేరు వినగానే, ఇది పురుష పౌరుష ప్రధానమైన కావ్యంకాదనీ, ఇందులో ప్రకృతి స్వరూపిణియైన నారీభావనకే ప్రముఖస్థానం కల్పించబడి ఉండవచ్చుననీ ఊహించడం సహజం. వాస్తవంలోకూడా ఇందులో ఏఒక్క వ్యక్తిపరమైనకథ వర్ణింపబడలేదు. దేశకాలాలకు, జాతి ధరాలకు అతమై విశుద్ధమైన 'మానవుని' మనోవ్యాకులత ఇందులో సుస్పష్టంగా, సుందరంగా చూపించబడింది.

## కామాయని కావ్యసౌందర్యం

కామాయని కథావస్తువు విశాలవటవృక్షపు సూక్ష్మ జము వలె అతిచిన్నది. ఇందులో మనువు, శ్రద్ధ, ఇడ ముఖ్య పాత్రలు. అసుర పురోహితుడు, మనువుపుత్రుడు మానవుడు, గౌణపాత్రలు. సారస్వత దేశపుప్రజల అలజడిని, అంతరిక్షంలోని దేవతల కోలాహలాన్ని పాఠకులు తెరచాటునుండి వింటారు. జల ప్రళయము, హిమాలయ శిఖరాలు, సారస్వత దేశదృశ్యాలు ప్రధానంగావున్నాయి.

కథావస్తువువిషయంలో రచయితచేసిన శ్రమ ప్రశంసనీయమైంది. వారి కల్పనాశక్తి అద్భుతము. కావ్యానికి ఆధారశిల హిమాలయపర్వతము, అందులోనికైలాసము, మానససరోవరము భారతీయులకు పవిత్ర పరిశుద్ధ స్మరణీయములు. నాయికా నాయకుల కలయిక ఆ పవిత్రతీరాన్నే జరిగింది. మనువు పుత్రుడైన మానవుడు ఆ హిమాలయాల్లోనే పుట్టాడు. యజ్ఞకర్మప్రారంభం కూడా అక్కడే జరిగింది.

ఈ కావ్యంలో పదిహేను సర్గలున్నాయి. ' ఆవేదన ' (మొదటిసర్గ) నుండి ' ఆనందం ' (చివరిసర్గ) వరకు మానవుని విన్న మనోదశలను వర్ణిస్తూ ఆవేదనతో అణగిపోతున్న మనిషి అన్ని అలజడులకు తట్టుకొని ఆనందాన్ని ఎలా పొందగలడు అన్నదే ఈ కావ్యంలో చెప్పబడింది.

సృష్టి ఆరంభాన ఉత్తరభారతాన ఒకదేవజాతి ఉండేది. వారు సౌష్ఠవమయిన ఆకారంకలిగి పరిపూర్ణ ఆరోగ్యవంతులుగా వుండే

వారు. యజ్ఞాలుచేసేవారు. పశువులను బలియిచ్చేవారు. అపార మైన వైభవంకలిగి విలాసపురుషులుగా తయారయ్యారు. వారి విలాసాలు మితిమీరాయి. ప్రకృతి ప్రకోపించింది. ఒక ఖండ ప్రళయంవచ్చింది. వారి వైభవమంతా నష్టపడిపోయింది. నలు వైపులూ జలమయమైపోయాయి. ఈజల ప్రళయంలో 'మనువు' అనబడే ఒకదేవతకు ఏవోవిధంగా ఒక నౌక సహాయం దొరికింది. ఒక జలచరము దానిపైన బలమైన దెబ్బకొట్టింది. దాంతో మనువు ఎగిరిపోయి హిమాలయాల కొండచరియలపైనపడ్డాడు. ఈవిధంగా దేవజాతి జము నష్టపడకుండా బ్రతికి బయటపడినప్పటి తనకళ్ళ యెదుటజరిగిన ప్రకృతి వినాశనాన్ని తల్చుకొని మనువు 'ఆవేదన' పొందుతాడు. క్రమంగా ప్రళయ ప్రకోపంతగ్గి ప్రకృతి శాంతి స్తుంది. మనువు మనస్సులో మ ళ వితంమీద 'ఆసక్తి' ఏర్ప డుతుంది. కొంతకాలానికి తనతోపాటు శ్రద్ధ అనే గంధర్వకన్య కూడ వించివున్నట్టు తెలుస్తుంది. ఈశ్రద్ధ ఎవరోకాదు, ఈకావ్య నాయిక కామాయనియే. ఆమెతో పరిచయం అతనికి 'ఆహ్లాదం' కలుగజేస్తుంది. ఆపరిచయం మెల్లగా 'అనురాగం'గా మారుతుంది. వలపులతో పులకరించిన రెండుహృదయాలమధ్య గాఢమైన 'అనుబంధం' ఏర్పడుతుంది. కాని దీనికి స్త్రీ సహజమైన బిడియం "అవరోధం" కల్పిస్తుంది. చివరకు కామాయని కాంతుని కౌగి టిలో కరగిపోతుంది. అసుర పురోహితుల సాయంతో యజ్ఞంచేసి ఇరువురు 'ఆచరణ' బంధాన్ని అంగీకరిస్తారు. శ్రద్ధ గర్భవతి అవుతుంది. అప్పుడు ఆమె మమకారం భావిసంతానంవైపు మళ్ళి

తనయెడల విముఖత ప్రదర్శించడం మనువు సహించలేడు. అతని కామార్తి శాంతించదు. 'అసంతృప్తి'తో అతడు అధికసుఖాన్నికై 'అన్వేషణ' సాగిస్తాడు. సారస్వత నగరంలో ఇడారాణితో అతనికి పరిచయం కలుగుతుంది. ఆమెకోరికప్రకారం తనబుద్ధిబలంతో అతడు నగర శాసనాన్ని చక్కబెడతాడు. కాని అతనిలో అణగివున్న కామవాసన ఇడనుకూడ స్వాధీనం చేసుకోవాలనిచూస్తుంది. ఇడ పెడముఖంపెడుతుంది. ప్రజలు తిరగబడతారు. ఈకల్లోలమంతా శ్రద్ధకు పీడకలగా కనిపిస్తుంది. 'ఆందోళన'తో ఆమె తన కన్నకొడుకును వెంటబెట్టుకొని పతినన్వేషిస్తూ వెళుతుంది. తుదకు సారస్వత నగరంలో ఇడ కనిపిస్తుంది. మైమరచిన 'ఆవేశం'తో ప్రజలతోపోరాడి గాయపడియున్న మనువునుచూచి ఆమె తనకల నిజమైందనివాపోతుంది. మనువును 'ఆప్యాయం'తో ఓదారుస్తుంది. మనువు పరితపించి శ్రద్ధకు తన పాపపంకిలముఖం చూపలేక అర్ధరాత్రివేళ పారిపోతాడు. శ్రద్ధ తనకొడుకును ఇడకు అప్పగించి మళ్ళీ భర్తను వెతుక్కుంటూ బయలుదేరుతుంది. చివరకు ఒక కొండగుహలో అతడు కనిపిస్తాడు. ఈసారి శ్రద్ధ అతనికి అతిలోక సాధ్విగా గోచరిస్తుంది. ఆమె ముఖమండలంలో అతనికి నాట్యలోలుని దివ్యతేజస్సు, తేజస్సునక తమైన 'ఆలోకం' భాసిస్తుంది. అప్పుడు వారిదువురు విశిష్టమైన మనోదశలో త్రిపుర సౌందర్యంచూస్తారు. ఇచ్ఛాజ్ఞానకర జగత్తుల అంతర్యం శ్రద్ధ వివరిస్తుంది. శ్రద్ధాసమేతుడైన మనువు మానస సరోవరాన్ని

తన చిరనివాసం చేసుకుంటాడు. ఈలోగా సారస్వత నగరవాసులను కూడగట్టుకొని ఇడకూడ మానవ (మనుతనయుడు) సమేతంగా మానసయాత్రచేస్తుంది. అక్కడ సాంద్రచైతన్య తరంగిణిలో ఓలలాడుతున్న మనువు అందరి 'ఆనందం' పంచిపెడతాడు. అది జగదేకసుందరమైన ఏకాంతం. ఇది 'కామాయని'లోని కథ.

'ఆవేదన' నుండి 'ఆనందం' వరకు క్రమపరిణామం పొందిన శ్రద్ధామయ మానవుని వివిధ మనోదశలు, భావభూమికలు ప్రతిబింబించే పదిహేనుసర్గల రసవత్కావ్యంఇది. ఇందులో శద్ధ హృదయాహ్లాదిని. ఇడ చిద్విలాసిని. రెండింటి సమన్వయం ఆనంద సంధాయకం అవుతుంది.

ఈ ప్రబంధ కావ్యానికి మహాకావ్యానికి వుండవలసిన లక్షణాలన్నీవున్నాయి. ఇందలి ప్రధానరసం శృంగారం. వాత్సల్యం, రౌద్ర, వీర, కరుణరసాలు సహాయకంగావున్నాయి. ఇందలి ప్రకృతివర్ణన చాలా అందంగా అధికంగాకూడా కనిపిస్తుంది.

ఉదాహరణకు :—

హిందీ:— ఉషా సునహాలే ర్ బర్సతీ
జయలక్ష్మీసీ ఉదిత హుయీ
ఉధర్ పరాజిత కాలరాత్రి భీ
జలమేం అంతర్నిహిత హుయీ.

తెలుగు:— పసిడి పసిడి బాణములను కురియుచు
విజయలక్ష్మివలె ఉదయించిన దుష
ఇపుడె పరాజిత కాళరాత్రియును
నీట మునిగి అంతర్హిత మయ్యె.

హిందీ:— యహ్ వివర్ణముఖ త్రస్త ప్రకృతికా
ఆజ్ లగా హఁసనే ఫిర్ సే
వర్షా , హుఆ సృష్టిమేఁ
శరద వికాస్ నయేసిర్ సే.

తెలుగు:— భయ వివర్ణముఖ ప్రకృతి మరలనే
డాశా ముదిత సుహాసిని అయ్యెను.
ముగిసిపోయినవి ముసురు దినములిక
మొదలయినవి శారద నవరాత్రులు,

ఈ కావ్యలక్ష్యమైన సమరసతాజన్య ఆనంద ప్రాప్తికూడ ప్రకృతి ప్రాంగణంలోనే జరుగుతుంది.

ఇందు మానసిక భావసంఘర్షణ అధికంగానూ, భౌతిక తత్వము స్వల్పంగానూ వున్నాయి. ఇతి వృత్తాత కత పరిమితం గానూ భావ చిత్రకరణ అపరిమితంగానూ వున్నాయి.

మనువు ఆత్మానందంలో లీనంకావడంతో గ్రంథం పరిసమాప్తమవుతుంది.

లేదు జడచేతన విభేదము
సమరసము సురుచిరము సకలము
సాంద్ర సతతానందమయ చై
తన్య మిది జగదేక కాంతము.

ఇందలి భావపక్ష కళాపక్షాలు రెండునూ పరిపుష్టంగావున్నాయి. శ్రద్ధ సౌందర్యవర్ణనలో ఒకపద్యం ఇలావుంది.

హిందీ:— ఘిర్ రహేథే ఘుంఘురాలే బాల్
అంస అవలంబిత ముఖకేపాస్
నీలఘన శావకసే సుకుమార్
సుధా బర్సానేకో విధు పాస్.

తెలుగు:— అంసద్వయ మవలంబనముగ నెల
కొన్న వదనమును కురులు ముసిరినవి
నీలమేఘ శావకములు మురియుచు
సుధను నింపుకొన శశినిచేరినటు.

ఈ కావ్యమందలిభాష అత్యంత లాక్షణిక మయినది. ఇందలి లాక్షణిక ప్రయోగాలు స్వాభావికంగానూ, బోధ గమ్యంగానూ వున్నాయి. అలంకారాలు భాషకొరకుగాక భావోత్కర్షకొరకు చేయబడ్డాయి.

వాటంక, రూపమాల, పాదాకులక్, రోలా మొదలగు ఛందస్సు వాడబడింది.

ఈ కావ్యంలో ఐతిహాసికతతోబాటు రూపకతత్వముకూడ సమన్వితమైవుంది. ఇందు దీన్ని మానవీయ మనోభావనల రూపక కావ్యమంటారు. ఇందలి పాత్రలు ఐతిహాసికమైనవే కాకుండా మానవ స్వభావానికి ప్రతీకములని కావ్యకర్త భూమిక యందు నమోదుచేసియేవున్నాడు. తదనుగుణంగా ఈకావ్యమందు కావ్యార్థముతోబాటు సాంకేతిక అర్థముకూడ అభివ్యక్తమవుతుంది.

ఇందలి ప్రధానపాత్రలయిన మనువు 'మనస్సు'నకు శ్రద్ధ 'శ్రద్ధ'కు, ఇడ 'బుద్ధి'కి ప్రతీకములు. కైవల్యము కేవలము బుద్ధి ద్వారా ప్రాప్తించదు. ఇందుకొరకు శ్రద్ధ సహకారము అనివార్యము. ఈవిధంగా మనువు శ్రద్ధల సహకారంతో మానవసృష్టి వికాసక్రమ కథావస్తువే ఇందు వర్ణింపబడింది.

భావగర్భితమైన ఈ బృహత్కావ్యాన్ని 'కవిరత్న' డా. ఇలపావులూరి పాండురంగరావుగారు తెలుగులోనికి ముక్తక ఛందస్సులో అనువదించారు. వారి తెలుగు అనువాదం సరళంగానూ రమణీయంగానూ సాగింది. ఈ వ్యాసమునందలి తెలుగుపద్యాలు వారి అనువాదకావ్యంనుండియే గ్రహింపబడ్డాయి.

" 'కామాయని' లాంటి కావ్యాన్ని విడదీసి జతపరచడం తాజ్‌మహల్‌లాంటి భవనాన్ని పడగొట్టి నిర్మించడం లాంటిదని సుకుమారకవి సుమిత్రానందనుడన్నాడు. నిజానికి తులసీరామాయణం తర్వాత చెప్పుకొనదగిన హిందీకావ్యం కామాయని. ఈ రెండూ మిగిలితేచాలు, హిందీసాహిత్యం నిలుస్తుందని విమర్శకు